ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల

రాబోవు గ్రంథము:

# "మాతృదేవీలీల"

ఈ పేరుతో కామరాజు హనుమంతరావుగారు వారి అర్ధాంగి, కీర్తిశేషురాలు అయిన శ్రీమతి సుందరమ్మగారి జీవితగాధను రచించిరి. ఆమె ఫోటోయు సుమారు నూరు క్రౌను అష్టాంశపుటలు గలిగియుండును. వెల రు. 1-0-0

ఆమె ద్వితీయ ఆబ్దికదినము, విజయ-ఆశ్వయుజ-శుద్ధ-ఏకాదశి, 18-10-1953 తేదీన ప్రకటింపబడును. అభిమానులు తమ సహాయవిరాళముల 1953 ఆగష్టు మాసాంతములోగా పంప ప్రార్థితులు.

ఈ పుస్తకాంతమున గ్రంథమాలనుగురించిన విజ్ఞప్తి గలదు. చందాదారులును అభిమానులును అది గమనింప వలయునని మనవి.

సంపాదకుడు

ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల : 6

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ముముక్షు చరిత్రము

## (స్వీయ హృత్కథా గానసుధ)

కర్త :


శ్రీ కామరాజు సింగరిదాసు

[ శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానంద సరస్వతీస్వామి ]


శ్రీ అనుభవానంద స్వాములవారిచే

సంకలితము




ప్రాక్ ప్రతీచీ గ్రంథాలయము

రాజమహేంద్రవరము

1953

కామరాజు హనుమంతరావు
సంపాదకుడు & ప్రకాశకుడు
ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల

ప్ర థ మ ము ద్ర ణ ము
విజయనామ సం॥ జ్యేష్ఠశుద్ధ పంచమి

వెల:
ఒక రూపాయి

# సంపాదకీయము

## శ్రీ సింగరిదాసు ఎవరు ?

**మాతృదేవోభవ ; పితృదేవోభవ ; ఆచార్యదేవోభవ.**

(తల్లిని దైవముగ నెంచుకొమ్ము ; తండ్రిని దైవముగ నెంచుకొమ్ము ; గురువును దైవముగ నెంచుకొమ్ము)  తైత్తిరీయోపనిషత్తు I. 11

బాపట్ల గ్రామములో నా సోదరులు చెన్న కేశవులు గారి గృహమున వీధివైపు అరుగుమీద ఒక కుర్చీలో వచ్చని ఛాయగల వృద్ధస్వాములవారు శుభ్ర కాషాయ వస్త్రములు ధరించి క్రొత్తగా ముండనము చేయబడిన శిరముతో నాసీనులై యుండిరి. కేవలమౌనము వహించి నిమీలితనేత్రములను దమ పాదముల దాకుచు నమస్కరించు వారిని జూచుటకు మధ్య మధ్య తెరచుచుండిరి. వారిచుట్టును వేయబడిన చాపలమీద వారి దర్శనార్థము వచ్చిన పురుషులు, స్త్రీలు-పలువురు కూర్చుండిరి. ఆ ప్రాతఃకాలసమయమున నేను రైలు దిగి యచటికి వచ్చితి. నా సోదరి వరలక్ష్మమ్మగారు, సోదరులు చెన్న కేశవులు వెంకటప్పయ్య గార్లు, ఇతర బంధువులు స్వాములవారి చెంత నుండుట గాంచితి. మా నాయనగారికి జబ్బు ఎక్కువగా నున్నదని తెలిసి నే నసలు వారిని జూచునిమిత్తము కాకినాడ నుండి వచ్చితి. అతినిశ్శబ్దముగ నున్న యీ దృశ్యము ఆశ్చర్యము గొల్పి నన్ను మరొక లోకమునకు గొంపోయినట్లు

లాయెను. కొంత తేరుకొని స్వాములవారిని పరికింపగా, వారు మా నాయనగారైన శ్రీ సింగరిదాసె యని గుర్తించితి. మా నాయనగారు ఆ రూపములో నుందురని యూహించుటకైన నాకేమాత్రము అవకాశము లేదు. మొదట వారెవరో యని తలచినప్పుడు పొడమిన యాశ్చర్యమంతయు నిప్పుడు అమిత దుఃఖముగ మారి నన్ను నిశ్చేష్టితుని జేసెను. ఈ మనోవికార ములు నాలో స్వల్పకాలములో వెంటవెంటనే కలిగెను.

అచ్చటికి వచ్చువారందరు వారి పాదములపై శిరము మోపి నమస్కరించుచుండిరి. వారికి సామాన్యముగనైన నమస్కరించుట నాకంతకు బూర్వమెప్పుడును అలవాటు లేదు. కాని యందరితో బాటు నేనును వారి పాదములపై వ్రాలి నమ స్కారము చేసి వారియెదుట నిలబడితి. వారు కన్నులు విప్పి నన్ను కొంతసేపు చూచి తిరిగి మూసికొనిరి. నే నెప్పుడు తమ వద్దకు వచ్చినను నా కుటుంబములోని యెల్లరి క్షేమ మడిగి యత్యంతాదరణముతో ముచ్చటించువారు. ఈ తూరి కుశల ప్రశ్నలు లేవు; మధుర సల్లాపములు లేవు. నాకు దుఃఖము లోపలినుండి పొరలి వచ్చుచుండెను. ఏడ్పు నణచుకొనుచుంటినే గాని కన్నులవెంట నీరు జొటజొట కారుచుండెను. అతి విచారముతో నేను కూడ వారిప్రక్కను కూర్చుంటిని. ఇదియంతయు నేమిటి యని బంధువుల ప్రశ్నింపగా, నాయనగారు ఆశ్రమము స్వీకరింప గోరినందున తత్సంస్కారము మొన్న

యథావిధిగ జరిపించితి మని చెప్పిరి. ఆ మాటలు విని విస్మితుడ నైతి.

వా రాజన్మవిరాగులై తామరాకుమీది నీటిబొట్టు వలె ప్రపంచమున మొదటినుండి చరించుచుండిరి. వా రప్పుడు బాహ్యసన్యాసము గోరియుందురా యని నా సంశయము. వారికి పదియవయేటనే ఆరేండ్లవయస్సుగల రుక్మిణమ్మ యను బాలికతో వివాహము గావింపబడెను. పుత్రపుత్రికా సంతానముతో గుటుంబము వర్ధిల్లెను. వారితండ్రి కృష్ణయ్య గారు దొరతనమువారి కొలువులో నిప్పటి తహసిల్ దారు పదవికి సరిపోవు నుద్యోగములో నుండి భోగభాగ్యములతో దులదూగుచు దానధర్మములకు బేరు వడసి మంచి పలుకు బడి గలిగి యుండిరి. ఐహికములగు నభివృద్ధి గాంచుటకు శ్రీ సింగరి దాసున కెన్నియో సదుపాయము లుండెను. కాని వారి కా యున్నతి ప్రాప్తించలేదు. ప్రభుత్వపు టుద్యోగము లందు ప్రవేశపెట్టబడిరే కాని యవి నిర్వహించుకొన లేక పోయిరి. పిత్రార్జితములయిన గృహక్షేత్రారామములు కాపా డుకొన లేకపోయిరి. సంసారవిషయములందు దృష్టి నిలుప లేకపోయిరి. అది జన్మసంస్కార మని చెప్పవలెను. వారికి బాల్యమునుండియు సర్వదా భగవచ్చింతనయె. ప్రపంచధోరణి యేమాత్రము గిట్టెడిది కాదు. ఈ సంబంధమయిన జీవిత వివరము లన్నియు 'శ్రీభక్తసింగరిదాసు' అను పేర ప్రచురింప

బడిన గ్రంథములో సవిస్తరముగ దెలుపబడెను. అవి యిచట మరల చేర్చుకొనుట యనావశ్యకము. వారధిక దైవీసంపత్తితో జన్మించిరని నుడిచిన చాలును. వ్యవహారదక్షులు గాకేదు గాని, తపోగరిష్ఠులు కాగలిగిరి. ఐహిక సుఖమునకు గడుదూరు లైనను, ఆముష్మికానందమునకు నిత్యధార కాగలిగిరి. అధికారవశులగు అనుచరవర్గముచే సేవింపబడకున్నను, భక్తిపరవశులగు శిష్యకోటి శుశ్రూషలు బడయగలిగిరి. వారి యావజ్జీవితము ఆధ్యాత్మిక సంబంధములతో విస్తరించి స్వపరభేదముల నతీతించు ధర్మదీప్తితో వెలుగొంద, వారు ప్రత్యక్షదైవముగ నిదివరకే యెందరకో పూజ్యులై యుండిరి. అట్టి మహాత్తర త్యాగయోగులు ఆశ్రమము గైకొనుట యెట్లు తటస్థించెనో బంధువుల నడిగి తెలిసికొంటి.

ఆశ్రమస్వీకరణమునకు బూర్వము సుమారు నెలరోజుల నుండి విరేచనములవలన క్రమముగ నీరసించుచు జబ్బుస్థితిలో చెన్నకేశవులుగారి గృహమున శ్రీ సింగరిదాసు నివసించుచుండిరి. ఒకనాడు బంధువులు తమ్ముజేరియున్న సమయమున వరలక్ష్మమ్మగారితో జీవప్రాయశ్చిత్తము జేయించుకొని సన్న్యాసము స్వీకరింపవలయు నని తమకు గోరికగా నున్నదని వెలిబుచ్చిరట. అంత నామె భయసంకోచముల నడుమ గొంత ధైర్యము దెచ్చుకొని 'నాన్నగారూ, మీరు ప్రథమమునుండి ఏలాటి ప్రాపంచిక వాసనలు లేక కుమ్మరిపురుగువలె సన్న్యాస

మున జీవించియుంటిరి గదా. అట్టి వైరాగ్యమూర్తులగు మీకు ఈ బాహ్యసన్యాసము అవసరమా యని తలంచు చున్నాము.' అని బదులుచెప్పిరట. తత్క్షణమె వారు 'అవును నిజమె'* అని యుచ్చరించి యూరకుండిరట. కాని యప్పటి నుండి వారు పూర్ణస్పృహతో నుండియు తమ మనస్సు నితర విషయముల మీది కెంతమాత్రము పోనియ్యక శరీరబాధల నయితము విస్మరించి కేవల రామనామ స్మరణమున యావత్కాలము గడపుట, వచునపేర్లతో నెవ్వరిని బిలువకుండుట, తమ కావశ్యకమయిన వస్తువుల గూడ నడుగకుండుట మున్నగు సంపూర్ణ విరాగచర్యలతో వర్తింప మొదలిడిరట. ఇట్లు గొన్ని దినములు జరిగెను. ఈ యద్భుత పరివర్తనము కనుగొని బంధువులు తమ్మువారు సన్యాస మిప్పింపు డని గోరినప్పుడు వారియభిలాష నీడేర్పకుండుట తమకు భావ్యముగ లేదని తల పోసి యందుల కేర్పాటు జేయించెద మని వారికి దెలుప 'మీ యిష్టము'♦ అని మాత్రము నుడివిరట. వారు నిరాకరింప లేదు కనుక, వెంటనె బంధువర్గము, శిష్యబృందము సమావేశమై మహావైభవముతో తత్సంబంధమయిన సంస్కారము జరిపించి 'శ్రీ బ్రహ్మానంద సరస్వతి' యనునది వారి కర్హ నామమని నిశ్చయించి యానామ మిడిరట. ఈ సంగతులన్నియు బరిశీలించినచో, ఆత్మసన్యాసమునకే వారు ప్రాముఖ్య మిచ్చి

* శ్రీ భక్త సింగరిదాసు. పుట 241.

♦ శ్రీ భక్త సింగరిదాసు. పుట 244.

నను సకల సంబంధబాంధవ్యముల త్రెంపి ప్రపంచము నుండి జీవుల గొంపోవు మృత్యువు సమీపించినకొలది వాని నెల్ల దామె యైచ్ఛికముగ జారవిడుచుచు దమ చిత్తవృత్తి దోడి వారలకు నటుల వ్యక్తపరచిరని ముఖ్యముగ గోచరించును. వారి వినిర్మల విశాల హృదయమందు స్థానము బొంది వారి ప్రేమాదరణలకు బాత్రుడ నగుట మహాభాగ్యముగ దలంచు చున్న నేను దానినిగోల్పోవుసమయమున నాహృదయాందోళన మెట్లుండెనో యూహించుకొనవలసినదె. వారు పరమపదించిన తోడనె నాలోగలిగిన సంక్షోభమునకు మేరలేదు. అంతవరకు దిగమ్రింగుగొనుచున్న దుఃఖము పట్టరాని దయ్యెను. ఆ రాత్రి యంతయు పెద్దయేడ్పుతో వీధిలోబడి దొర్లితి. బంధువు లూర డింప జూచిరి. లాభము లేకపోయెను. ఆవరకు శోషిల్లి శాంతించితి. అది యంతయు దలచుకొనిన, నాకే యాశ్చర్య ముగ దోచును. బాల్యమందును తరువాత గొంతకాలము వరకును వారి యాత్మోన్నత్యము నేను గుర్తింపని వాడనె యయినను, పిమ్మట నయ్యది గ్రహించు సందర్భము లేర్పడి వారు నాకు జన్మపితయె గాక ధర్మపితయు గూడ నైయున్నా రని గమనింపగలిగితి. భౌతికజీవనమునకు గారకులై ప్రాపంచి కైశ్వర్యాభివృద్ధుల సమకూర్చుచు నవ్యాజప్రేమతో బాటు పడు జననీజనకులు తమ పుత్రికాపుత్రులకు దైవస్వరూపులుగ సంసేవితు లగుచున్నారు. ఆధ్యాత్మికజీవనము బురికొల్పి సంపాదించుగురువులు అధికతర విభూతితో తమ శిష్యులకు

ఈశ్వర మూర్తులుగ పూజనీయు లగుచున్నారు. గురువులు నర్మజీవనమునకు గారణభూతులు గాన, ధర్మపితలుగ ప్రస్తుతింప బడుదురు. తండ్రియె గాక గురువు కూడ కాగలిగిన శ్రీ సింగరిదాసుగారి మరణము నా కత్యంత విషాదకర మెట్లు గాకుండును ?

శ్రీ దాసుగారి జీవితప్రబోధమె గాక వారి యుపదేశ శిక్షణాదుల సయితము బొంది యాత్మోన్నతి గాంచిన భక్తశిఖామణులగు శిష్యగణమునకు నేను జెందినవాడ గాను. నేను వారి కేవల జీవిత ప్రబోధముచేతనే వారి యనుచరుడనైతి. నేను చెప్పుకొనిన గాని నేను వారి శిష్యుడ నని యితరులకు దెలియజాలదు. నా వంటి శిష్యులు వారి కెందరు గలరో నిర్ణయించుట యసాధ్యము. వారు నా హృదయము స్పర్శించి నన్నెట్లు తమ వశీభూతునిగ జేసికొనిరో తెలుపుటకు ఒక్క సంఘటన మాత్ర మిచట నుదాహరించెద. సంస్కరణ కార్యములచే సంఘబహిష్కృతుడనై యొకప్పు డేకాకిగా నే నొక గృహమున గొన్ని రోజులనుండి తీవ్రజ్వరపీడితుడనగుచు నసహాయస్థితిలో నుండ, మూసియున్న గుమ్మమువద్ద 'హనుమంతం, హనుమంతం' అను పిలుపు వింటిని. వా రెవరై యుందురా యని తలంచుచు నెక్కుడు ప్రయాసతో మంచము మీదనుండి లేచి తలుపు దీసి బయటికి వచ్చితి. ప్రేమవిలసిత వీక్షణములతో, ప్రేమరస మొలుకు మృదూక్తులతో నచట

నరుగుమీద గూర్చున్న ప్రేమమూర్తులు మా నాయనగారె యని తెలిసికొని యానందపరవశుడ నైతి. వారి మధురవచనములతో గూడిన పరామర్శయె యమృతప్రాయమై నా కెంతో యారోగ్య బలముల నాడు చేకూర్చెను. వారు నిశ్చయముగా నా పాలిటి ప్రత్యక్షదైవమె యని నా యాత్మకు ద్యోతక మాయెను. ఇట్టి యాత్మానుభూతులే వారు నాకు ధర్మపిత యని, గురుదేవుడని నేను పరిగణించుటకు గారణములు. ఇట్లే వారి బంధువులు, ఇతరులు వారితో ఆత్మీయ సంబంధముల బడసి తమతమ సంస్కారములకు దగినటుల నాత్మాభివృద్ధి గాంచగలిగిరి. వారితో బరిచయము సర్వసాధారణముగ నెల్లరకు నెట్లు లభించుచుండెనో తెలిపెద. వారు స్వరచిత కీర్తనల వ్రాతప్రతులు, కట్టుకొను కొలది వస్త్రములు చిన్న మూటలుగ గట్టి భుజమున బెట్టి తలపాగా ధరించి చెప్పులు తొడిగి కర్ర జేత బట్టి తరచు తంబురను గూడ మోసికొనుచు ఒక గ్రామము విడిచి మరొక గ్రామమునకు అనికేతనుడై పోవుచు దమ యానందము ననుసరించి కొంతకాల మచటచట విడియుచు దమ సంకీర్తనలచే దాము తన్మయులగుచు నితరుల దన్మయుల జేయుచుండు దృశ్యము అంతర నాకర్షించి వారి సమీపమునకు దెచ్చి క్రమపరివర్తనమునకు లోనుజేసెడిది.

వారు స్వర్గస్థులైన పిమ్మట సుమారు పాతిక సంవత్సరములకు వారి చరిత్ర ప్రచురింపవలె నని నాకు బుద్ధిపుట్టి నా

యుద్దేశము తెలిపిన తోడనే తా మెరిగినట్టియు విన్నట్టియు సంశముల నెల్ల నా సోదరులు వెంకటప్పయ్యగారు ఒక పుస్తకములో వ్రాసియుంచి వారు మరణశయ్యపైనుండగా వారిని జూచునిమిత్తము నేను వచ్చినప్పుడు, మొట్టమొదట ఆ పుస్తకము దెప్పించి నా కిచ్చి తరువాత నితర విషయముల బ్రస్తావించిరి. వారి భక్తివిశేషము కనుగొనుడు. శ్రీ అనుభవానంద స్వామీజి, నాసోదరులు చెన్న కేశవులుగారి చివరి కుమారుడు, తన జీవితపరివర్తనమునకు ముఖ్యకారకులును శ్రీరామకృష్ణ పరమహంసులతో సమానముగ దనకు గురుదేవులు నయిన శ్రీ సింగరిదాస జీవిత చరిత్ర నేను ప్రకటింప దలచితి నని నా వలన దెలిసికొనిన వెంటనె యూరూర నెంతయో శ్రద్ధతో దిరిగి సమాచారము సాధ్యమైనంతవరకు బోగుచేసి 228 డెమి ఆక్టావో సైజు అచ్చుపుటలకు సరిపడు వ్రాతప్రతి సిద్ధము చేసి నాచేతిలో బెట్టెను. ఈ యువకుని ధర్మనిరతి గాంచుడు. శ్రీ సింగరిదాసు నెరిగినవారిలో నప్పటికి సజీవులైయున్న బంధువులు, శిష్యులు, అభిమానులు-ఎల్లరు వలసిన ధనసాహాయ్యము జేసి కాగితమునకు కరవుగా నున్న 1941 వ సంవత్సరములో శతవార్షిక జయంతి నాటికి 'శ్రీ భక్తసింగరిదాసు' అను పేర పెద్దగ్రంథము ముద్రింపబడుటకు దోడ్పడిరి. వీరి గౌరవప్రపత్తి బరికింపుడు. ఇప్పు డీకీర్తనల ప్రచురణ విషయమున తమ భక్తి కానుకల సమర్పించి యీ ప్రయత్నము గూడ సఫలీకృత మగుటకు దోడ్పడిన భక్తవర్యుల కైంకర్య ప్రవృత్తి తిలకింపుడు.

శ్రీ సింగరిదాస విరచిత కీర్తనలు వ్రాత ప్రతులనుండి వారి ప్రధాన భావముల వ్యక్తీకరించు కొన్ని యేరి క్రమవరుసను కూర్చి వానిని గురించిన మున్నుడితో సకాలమున కంద జేసి యీ గ్రంథ ముద్రణమునకు గూడ శ్రీ అనుభావానంద స్వామీజి సాయపడుట యెంతయు ప్రశంసనీయము గదా! శ్రీ సింగరిదాస మృతశరీరము స్థాపితమైన చోట వారి యాశ్రమ నామముతో సాధన సదుపాయములు గలిగి భక్తిపిపాసకుల పిపాసదీర్చు బ్రహ్మానందాశ్రమము నెలకొల్పుటకు శ్రీ అనుభవానంద స్వామీజి ప్రస్తుతము చూపుచున్న కార్యదీక్షయు సఫలత గాంచునని యాశింప దగును. ఈ దృష్టాంతము లన్నియు శ్రీ సింగరిదాస జీవిత ప్రభావము వెల్లడించుచున్నవి.

సామాన్యముగ తల్లిదండ్రు లితరులయెడ నెటుల వర్తించినను తమ సంతానమునెడ స్వార్థ రహితబుద్ధితో, సదుద్దేశముతో, వారి శ్రేయము కొరకే పాటుపడుదురు. భగవానుడు సంతానరూపమున అతిదీనముగ సంతోషకరములగు ముద్దు పలుకులతో, వింతగొల్పు చేష్టలతో సమీపించి, బాలభానుడు మృదుకరములతో పూమొగ్గలను వలె, తల్లిదండ్రుల హృదయముల స్పర్శించి వికసింప జేసి అవ్యాజ ప్రేమ సుగంధము ప్రసవింప జేయుచున్నాడు. భగవానుడె వారితో నైక్యమగుచు వారలయందు మూర్తీభవించుచున్నాడు. తాము 'అమృత

పుత్రులు'* మని సంతానమునకు మొదట తెలియదు. తల్లి తండ్రుల దేవత్వముచే పురిగొల్పబడి వారల సేవించి సంతానము జీవితరహస్య మెరిగి తరింప గలుచున్నది. కాని శ్రీసింగరిదాసు సామాన్యవ్యక్తి కారు. శ్రీబుద్ధభగవానునివలె అసాధారణ పురుషులు; పుట్టుకతోడనే పరమభక్తులు. "నన్ను ఏకాగ్రభక్తితో సేవించువారు త్రిగుణాతీతులై బ్రహ్మైక్యము గాంతు"♦ రని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు నుడివినరీతి భక్తిశిఖర మధిరోహించిరి. యుగపురుషులవలె లోక సంగ్రహమునకై జీవించి జగద్విఖ్యాతి గడింపకున్నను, ఈశ్వరభక్తులెల్లరు తమ గృహములలో, పరిసరములలో దైవస్వరూపులుగ వెలుగొందుచున్నారు గదా ?

---

* శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః! .........
(అమృతుని పుత్రులగు సర్వలోకవాసులారా! వినుడు......)
శ్వేతాశ్వతరోపనిషత్తు II. 4

♦ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.
భగవద్గీత : XIV. 26

# II

యే యథా మాం ప్రపద్యన్తే, తాం స్తథైవ భజామ్యహమ్ ;
మమ వర్త్మానువర్తన్తే, మనుష్యాః పార్థ సర్వశః.

(ఎవ రేవిధమున నన్ను నుపాసింతురో, వారి నవ్విధముననె కృతార్థుల జేతు. ఓ పార్థ! మానవు లన్ని విధముల నా మార్గమునె యనుసరించు చున్నారు.)
భగ॰ద్గీత: IV. 11

"పిమ్మట నా మాని సింగన్నను తిలకించి 'అబ్బాయీ! నీవు చాల పుణ్యాత్ముడవు, భక్తుడవు, సిద్ధుడవు. నీ వంటి వాడు ప్రపంచమున చాల అరుదు సుమా! నీవు పిన్నవయస్సులోనె యింత వైరాగ్యమూర్తివై సుజ్ఞానమును సంపాదించితివి. నీ విక నెచట నున్నను, ఏమి చేసినను, అవి నిన్ను బంధింపవు. నీ వలన ననేకులు నేర్చుకొను విషయములు గలవు. కాన నీ విచట నిక నుండ నవసరము లేదు. నీవు నీ యింటికి వెళ్లి ఆదర్శగృహస్థుడవై తనరారవలసినది.' అని గంభీరకంఠమున శ్రీరామకృష్ణుడు నాగమహాశయునకు జెప్పినటుల మానికులావతంసము పలికెను. అందుల కానంద మినుమడింప, ఆ మూర్తి మీద దృష్టుల నిగిడించి చూచుచు నట్టె కొంతతడవు శ్రీ సింగరిదాసు కూర్చున్నవాడై మెల్లగ నిట్లనియె. 'స్వామీ, మీరు చెప్పినది సమంజసముగనె ఉన్నదిగాని, నే నంతవాడ నగుదునా! నానుండి యెవరేమియు నేర్చుకొన జాలరు. నా కేమి తెలియును? నే నితరులనుండి యెంతయో తెలిసికొనవలెను. అదియును గాక, నేను సర్వసంగపరిత్యాగ మొనర్ప నిచ్చతో నిట

కరుదెంచి యుంటిని. మరల మీరు నన్ను బొమ్మనుట నాకు చిత్రముగా నున్నది.' అని సింగరిదాసు పలుక 'అబ్బాయీ! నా కదంతయు తెలుసును. నీ విక ఆధ్యాత్మిక సాగరమున నేమి, ప్రాపంచిక రంగమున నేమి, నిష్కామవృత్తి సులభముగా జీవింపగల శక్తుడవైతివి. కాన నీవు పోవలసినది.' అని మరల నొక్కిచెప్పి శ్రీ సింగరిదాసును దీవించి వెడలిపోయెను." *

శ్రీ సింగరిదాసు సింగరయ్య, సింగన్న యని కూడ పిలువబడువారు. వారికి పాతిక సంవత్సరముల వయస్సు వచ్చినది. ప్రథమపుత్రుడు, కృష్ణయ్య, జన్మించినాడు. ఇప్పటికి రెండు పర్యాయములు దొరతనము వారి యుద్యోగములందు సింగరిదాసు ప్రవేశపెట్టబడుట, వారు వానిని మానివేయుట జరిగినది. గృహకృత్యములను క్రమముగ నిర్వహింపకుండిరి. స్వగ్రామమయిన వెంకటాపురములో రామమందిరమున భజన లందు బాల్గొనుట, సమీపమందున్న సింగరిగిరి నరసింహాలయమున ఏకాంత సేవలు సల్పుట మున్నగు భక్తిసాధనలతో తృప్తినొందక, ఉద్యోగమున జేర నిచ్ఛ లేక, పెరుమాళ్లస్వామి దర్శనార్థము నెల్లూరుయాత్రకు బయలుదేరి దారిలో పెన్నా నదీప్రవాహమున ప్రాణాపాయమునకు లోనయ్యు వెరువక యది గడచినతోడనె గమ్యము జేరి సఫలమనోరథులైరి. ఉద్యోగమన్నను కుటుంబమన్నను వారికి బూర్తిగ విరక్తి

* శ్రీ భక్త సింగరిదాసు: పుట 116.

యేర్పడెను. ఇట్టితరి మామగారు, మామిళ్లపల్లి అప్పయ్యగారు, తమయింట జరుగనున్న యొక శుభకార్యమునకై మామిళ్ల పల్లి గ్రామమునకు సింగరిదాసును సకుటుంబముగ దీసికొని పోవు నిమిత్తము వచ్చిరి. తాము రాజాలమని చెప్పి వారితో భార్యను బిడ్డను బంపివేసిరి. అదియె తగిన తరుణమని యెంచి సింగరిదాసు పెదతిరుపతి యాత్రకు వెడలిరి. అచటికి బోవలయు నని యిదివర కొకతూరి వారు చేసిన ప్రయత్నము విఫల మయ్యెను. ఈ తూరి నెట్టి యాటంకములు లేకుండుటచే వెంక టేశ్వర సన్నిధికి జేరగలిగిరి. అనుదినమును స్వామిని ప్రాతః కాలమున దర్శించి మధుకరివలన క్షుద దీర్చుకొనుచు నచటి యొక గుహయందు తీవ్రతపస్సు సలుపుచుండిరి. ఇదివరకు సింగరిగిరి నరసింహాలయమునం దొక దినమున యోగిని, సీతాంబ, తమ కాకస్మికముగ గాన్పించి యుపదేశించిన తారక మంత్రరాజము జపించుచు శ్రీరామదేవుని సాక్షాత్క-రించుటకే వారి యిప్పటి యుగ్రతపోనిష్ఠయంతయు. బాహ్య విషయములందు శ్రద్ధ తొలగెను. శరీరము క్రమముగ నీర సించెను. తలవెండ్రుకలు, గడ్డము పెరిగెను. పిచ్చివాని రూపు వచ్చెను. ఇట్లు తదేకధ్యానముతో ఆరుమాసములు గడపిన తరువాత శ్రీరామ భగవానుని ప్రత్యక్ష దర్శనభాగ్యము బడసి సింగరిదాసు ధన్యులైరి. తద్దర్శనానందభరిత హృద యముతో వారచటనే మూడురోజు లుండిన పిమ్మటనే ఒక మునిపుంగవుడు తారసిల్లి వారితో బైని దెలిపిన రీతిని

పుత్రులు'* మని సంతానమునకు మొదట తెలియదు. తల్లి తండ్రుల దేవత్వముచే పురిగొల్పబడి వారల సేవించి సంతానము జీవితరహస్య మెరిగి తరింప గలుచున్నది. కాని శ్రీసింగరిదాసు సామాన్యవ్యక్తి కారు. శ్రీబుద్ధభగవానునివలె అసాధారణ పురుషులు; పుట్టుకతోడనే పరమభక్తులు. "నన్ను ఏకాగ్రభక్తితో సేవించువారు త్రిగుణాతీతులై బ్రహ్మైక్యము గాంతు"♦ రని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు నుడివినరీతి భక్తిశిఖర మధిరోహించిరి. యుగపురుషులవలె లోక సంగ్రహమునకై జీవించి జగద్విఖ్యాతి గడింపకున్నను, ఈశ్వరభక్తులెల్లరు తమ గృహములలో, పరిసరములలో దైవస్వరూపులుగ వెలుగొందుచున్నారు గదా?

---

* శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః! .........

(అమృతుని పుత్రులగు సర్వలోకవాసులారా! వినుడు......)

శ్వేతాశ్వతరోపనిషత్తు II. 4

♦ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

భగవద్గీత : XIV. 26

## II

**యే యథా మాం ప్రపద్యన్తే, తాం స్తథైవ భజామ్యహమ్ ;**
**మమ వర్త్మానువర్తన్తే, మనుష్యాః పార్థ సర్వశః.**

(ఎవ రేవిధమున నన్ను నుపాసింతురో, వారి నవ్విధముననే కృతార్థుల జేతు. ఓ పార్థ! మానవు లన్ని విధముల నా మార్గమునే యనుసరించు చున్నారు.) భగః గీత: IV. 11

"పిమ్మట నా మాని సింగన్నను తిలకించి 'అబ్బాయీ! నీవు చాల పుణ్యాత్ముడవు, భక్తుడవు, సిద్ధుడవు. నీ వంటి వాడు ప్రపంచమున చాల అరుదు సుమా! నీవు పిన్నవయస్సు లోనె యింత వైరాగ్యమూర్తివై సుజ్ఞానమును సంపాదించితివి. నీ విక నెచట నున్నను, ఏమి చేసినను, అవి నిన్ను బంధింపవు. నీ వలన ననేకులు నేర్చుకొను విషయములు గలవు. కాన నీ విచట నిక నుండ నవసరము లేదు. నీవు నీ యింటికి వెళ్లి, ఆదర్శగృహస్థుడవై తనరారవలసినది.' అని గంభీరకంఠమున శ్రీరామకృష్ణుడు నాగమహాశయునకు జెప్పినటుల మానికులా వతంసము పలికెను. అందుల కానంద మినుమడింప, ఆ మూర్తి మీద దృష్టుల నిగిడించి చూచుచు నట్టె కొంతతడవు శ్రీ సింగరి దాసు కూర్చున్నవాడై మెల్లగ నిట్లనియె. 'స్వామీ, మీరు చెప్పినది సమంజసముగనె ఉన్నదిగాని, నే నంతవాడ నగుదునా! నానుండి యెవ రేమియు నేర్చుకొన జాలరు. నా కేమి తెలి యును? నే నితరులనుండి యెంతయో తెలిసికొనవలెను. అది యును గాక, నేను సర్వసంగపరిత్యాగ మొనర్ప నిచ్చతో నిట

కరుదెంచి యుంటిని. మరల మీరు నన్ను బొమ్మనుట నాకు చిత్రముగా నున్నది.' అని సింగరిదాసు పలుక 'అబ్బాయీ! నాకదంతయు తెలుసును. నీ విక ఆధ్యాత్మిక సాగరమున నేమి, ప్రాపంచిక రంగమున నేమి, నిష్కామవృత్తి సులభముగా జీవింపగల శక్తుడ వైతివి. కాన నీవు పోవలసినది.' అని మరల నొక్కిచెప్పి శ్రీ సింగరిదాసును దీవించి వెడలిపోయెను." *

శ్రీ సింగరిదాసు సింగరయ్య, సింగన్న యని కూడ పిలువబడువారు. వారికి పాతిక సంవత్సరముల వయస్సు వచ్చినది. ప్రథమపుత్రుడు, కృష్ణయ్య, జన్మించినాడు. ఇప్పటికి రెండు పర్యాయములు దొరతనము వారి యుద్యోగములందు సింగరిదాసు ప్రవేశపెట్టబడుట, వారు వానిని మానివేయుట జరిగినది. గృహకృత్యములను క్రమముగ నిర్వహింపకుండిరి. స్వగ్రామమయిన వెంకటాపురములో రామమందిరమున భజన లందు బాల్గొనుట, సమీపమందున్న సింగరిగిరి నరసింహా లయమున ఏకాంత సేవలు సల్పుట మున్నగు భక్తిసాధనలతో తృప్తినొందక, ఉద్యోగమున జేర నిచ్ఛ లేక, పెరుమాళ్లస్వామి దర్శనార్థము నెల్లూరుయాత్రకు బయలుదేరి దారిలో పెన్నా నదీప్రవాహమున ప్రాణాపాయమునకు లోనయ్యు వెరువక యది గడచినతోడనె గమ్యము జేరి సఫలమనోరథులైరి. ఉద్యోగమన్నను కుటుంబమన్నను వారికి బూర్తిగ విరక్తి

* శ్రీ భక్తసింగరిదాసు: పుట 116.

యేర్పడెను. ఇట్టితరి మామగారు, మామిళ్లపల్లి అప్పయ్యగారు, తమయింట జరుగనున్న యొక శుభకార్యమునకై మామిళ్ల పల్లి గ్రామమునకు సింగరిదాసును సకుటుంబముగ దీసికొని పోవు నిమిత్తము వచ్చిరి. తాము రాజాలమని చెప్పి వారితో భార్యను బిడ్డను బంపివేసిరి. అదియె తగిన తరుణమని యెంచి సింగరిదాసు పెదతిరుపతి యాత్రకు వెడలిరి. అచటికి బోవలయు నని యిదివర కొకతూరి వారు చేసిన ప్రయత్నము విఫల మయ్యెను. ఈ తూరి నెట్టి యాటంకములు లేకుండుటచే వెంక టేశ్వర సన్నిధికి జేరగలిగిరి. అనుదినమును స్వామిని ప్రాతః కాలమున దర్శించి మధుకరివలన క్షుద దీర్చుకొనుచు నచటి యొక గుహాయందు తీవ్రతపస్సు సలుపుచుండిరి. ఇదివరకు సింగరిగిరి నరసింహాలయమునం దొక దినమున యోగిని, సీతాంబ, తమ కాకస్మికముగ గాన్పించి యుపదేశించిన తారక మంత్రరాజము జపించుచు శ్రీరామదేవుని సాక్షాత్క రించుటకే వారి యిప్పటి యుగ్రతపోనిష్ఠయంతయు. బాహ్య విషయములందు శ్రద్ధ తొలగెను. శరీరము క్రమముగ నీర సించెను. తలవెండ్రుకలు, గడ్డము పెరిగెను. పిచ్చివాని రూపు వచ్చెను. ఇట్లు తదేకధ్యానముతో ఆరుమాసములు గడపిన తరువాత శ్రీరామ భగవానుని ప్రత్యక్ష దర్శనభాగ్యము బడసి సింగరిదాసు ధన్యులైరి. తద్దర్శనానందభరితహృద యముతో వారచటనే మూడురోజు లుండిన పిమ్మటనే ఒక మునిపుంగవుడు తారసిల్లి వారితో బైని దెలిపిన రీతిని

సంభాషణ జరిపెను. అంతులకు విస్మితులగుచు మునియా
దేశము మదిని దలపోయుచు ఆ మరుచటిదిన ముదయమున
దేవాలయమునకు బోవుచుండ, తమ్ము వెదకుచు తుద కచటి
కరుదెంచిన మామగారిని మేనమామగారిని భార్యను సింగరి
దాసు చూచిరి. వారు కొంతసేపటికి దమ్ము గుర్తింప గలిగిరి.
ఇంటికి రమ్మని బ్రతిమాలిరి. మునియాజ్ఞ కనుగుణముగ వారి
యాహ్వాన ముండుట చిత్రముగ దోచెను. సర్వ మీశ్వరా
యత్తమని యెంచి వారివెంట వెంకటాపురమునకు సింగరి
దాసు వెళ్లిరి. వారి జీవితములో నిది యొక మహాఘట్టము.
తదనంతరమె వారి జీవితపథము నిరూపితమయ్యెను. వారి
వర్తన దృఢత వహించెను. వారి మాటలు భావగర్భితములు
కాజొచ్చెను. వారి హృదయానందము సహజకవితారూపము.
దాల్చి పొంగి పరుగులిడు మహాప్రవాహమువలె వరలెను.
శ్రీ ప్రహ్లాద భక్తవరేణ్యుని భక్తితత్పరత* సింగరిదాసునందు
పొడసూపెను. ప్రపంచకార్యములు సలుపుచున్నను, శరీర
ధర్మములు నిర్వర్తించుచున్నను, శ్రీమన్నారాయణునియందె
మనస్సు లగ్నముచేసి, విషయప్రపంచము మరపించు భక్తి

---

* పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్—భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్—లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ—చింతామృతాస్వాదసం
ధానుండై మరచెఁ సురారిసుతుఁడే—తద్విశ్వమున్ భూవరా.

భాగవతము : VII. 123

సోపానముల నారోహింపగల శక్తి సింగరిదాసునకు లభించెనని వారిని సమీపించిన యెల్లరకు సుస్పష్టమగుచుండెను. వారు చిన్నప్పటినుండియు దేనిని కాంక్షించుచుండిరో, ఆ ముక్తికి మార్గము వారికి తిరుపతికొండలపై దొరకెనని మనము గ్రహింపవలెను. అటుపిమ్మట ఆ ముక్తిపథమున దినదినము అగ్రసరులగుచు వివిధసమాధిస్థితుల బొంది ధన్యులైరి. తమ యాత్మానుభవములెల్ల తమ కవితాద్వారమున అతిసహజముగ, అతిసరళముగ వెలిబుచ్చిరి. కొంచెము శ్రద్ధతో మనము వారి మధురగీతములను పరిశీలించినచో, ముక్తి యననేమో, మోక్షసిద్ధి యంతకంత కెటుల గభీరతజెందునో, భావ మహాభావ సమాధులందెట్టి యనుభూతులు సమకూరునో సమస్తము సువ్యక్తమగును. వారు రచించిన కీర్తనలు ఒక క్రమమున పుస్తకములో వ్రాసికొని యా పొత్తమునకు 'ముముక్షు చరిత్రము' అని పేరిడిరి. అది మనము చదువుచుండిన, అందలి ముముక్షువు శ్రీసింగరిదాసే యని, అందలి భావజాలము వారి హృత్కథాగానసుధయేయని కనుగొనగలము. సిద్ధముముక్షువు 'ధీరుడు'♦ అని కీర్తనలలో నచటచట జెప్పియున్నారు. మరియు

---

♦ కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్
ఆవృత్తచక్షుః అమృతత్వ మిచ్ఛన్.

(కొందరు ధీరులు అమృతత్వము గోరువారలై బాహ్యమునుండి చక్షువుల మరల్చి ప్రత్యక్షపరమాత్మను దర్శించెదరు.)

కఠోపనిషత్తు: II. 1వ వల్లి 1.

వారు ధీరముముక్షుపదవి నొందినటుల తామె చెప్పికొనిరనియు తెలిసికొనగలము. ధీరముముక్షు చరిత్రము మొదటినుండి చివరవరకు నెట్టి పరిణామస్థితుల దాల్చునో శ్రీసింగరిదాస సుభాషితములు వ్యక్తపరచును.

ముక్తిని గోరువాడు ముముక్షువు గదా? తానున్న ప్రస్తుతస్థితి తనకు తృప్తినీయ కుండిన, దాని విడిచి యంతకంటె నుత్తమమైన స్థితి బడయుచుండుట వివేకవంతుని లక్షణము. "ఇంద్రియములు శ్రేష్ఠములు; ఇంద్రియములకంటె మనస్సు శ్రేష్ఠము; మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠము; బుద్ధికంటె ఆత్మ శ్రేష్ఠము" అని * భగవద్గీతయు, ఈ భావమునె వేరు వచనములలో అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము బ్రహ్మస్వరూపములె గాని వానిలో వరుసను ఒక దానికంటె నొకటి శ్రేష్ఠతరములని ♦ తైత్తిరీయోపనిషత్తు నుడువుచున్నది. కేవల జడమని మనము తలంచు అన్నమునుగూర్చి యీ సందర్భమున భగవద్గీత ప్రస్తావించనేలేదు. ప్రకృత నాగరికతకంతకు నాధారభూత మని చెప్పదగు జడప్రకృతి ఆర్యమహాత్ములదృష్టిలో అధమాధమము. జడప్రపంచమున నెంతటి విలువగలవస్తువైనను

* ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధే పరతస్తు సః
భగవద్గీత: III. 42

♦ తైత్తిరీయోపనిషత్తు — భృగువల్లి

మానవునకు తృప్తిగొలుపదని * కఠోపనిషత్తు చెప్పుచున్నది. అయ్యది కొలదిగనో గొప్పగనో సర్వమానవుల యనుభవము లోనికి వచ్చు విషయమె. జగత్తులోని సర్వ మనిత్యము. ఒకవస్తువు నం దెంత మమకార ముండినను, అది యదృశ్య మయిన తోడనే యంత విరక్తి జనింపక మానదు. మృత్యువు, పరివర్తన భయా నకము లగును. అనిత్యమందు నిత్యముయొక్క స్ఫురణ గలు చునే యుండును. కావున నిత్యానిత్యవస్తు వివేకము పొడ మును; నిత్యమునందు భక్తియంకురించును; తద్భక్తి నిష్కామ కర్మకు గారణ మగును. జ్ఞానభక్తి కర్మలు పరస్పర సహకారు లగుచు ఆధ్యాత్మికజీవనమును సర్వతో ముఖముగ వికసింపజేసి యుత్తమమును తేజోవంతమును శాశ్వతమునయిన సచ్చిదానంద దాప్తి నొలబాడజేయును. ఆపదవిమె పూర్ణత్వము, నిర్వాణము, బ్రాహ్మిస్థితి. ఈసహజ ఆత్మోన్నతి గతులను శ్రీసింగరిదాసు అనుభవ పూర్వకముగ వివరించి యున్నారు. వారు ప్రథమ హీనస్థితి కెంతయో వగచుట, ఉన్నతస్థితులు బడసినకొలది అవి స్పష్టీకరించుచు నధికతరముగ నానందించుట మనము గాంతుము. శ్రీ రామకృష్ణునివలె భిన్నరూపముల ధ్యానించి యిష్టసిద్ధుల బొంది సుఖించుటయు గందుము.

---

* న విత్తేన తర్పణీయో మనుష్యః
(మనుష్యుడు ధనముచే తృప్తి పొందడు.)
కఠోపనిషత్తు: I. 1 వల్లి: 27

"చిన్ననాటనుండి - అన్న! నమ్మియున్నారా;
పన్నగశయన! నన్ను - మన్నన సేయరాదా ?"
"ముక్తిని జేకూర్చు మయ్యా! - సద్గురు
మహిమచే సన్మోదమొందితి నయ్యా!"
" ఈ జన్మలోనె ముక్తినియ్యరా -
ఈ యిడుములనుండి నన్ గావరా!"
"రాముడే గలడు—నాపాలి సీతా—రాముడే గలడు"
"తల్లిదర్శన మాయెను - సీతమ్మయా - తల్లి దర్శన
మాయెను"
"హరిహరాదుల నౌకరి - హాస్యము సేయుకు"
"ప్రేమగీతములు - నామది జూచి నే
కామక్రోధముల - గడతేర్చుటచే॥ ధన్యుడనైతిని."
"అఖిలము నేనను ఆనందమనే - యోగము కల్పించితే
సకలమైన చరాచరమునె యై-సంపూర్ణుడనైతి రామా!"
" వైరాగ్యము మదిని - నిరతము నే - మరక దలపోయ,
వైరాగ్య మహిమచే - వైకుంఠ సన్నిధి
ధీరుడై * నివసింప-స్థిరమని నమ్మిన ॥ నేనే బ్రహ్మమురా"
సింగరిదాసు మహిమల్ - బహు-శృంగారములై యొప్పన్;

---

* అతిముచ్య ధీరాః.........
(దేహము తానను బుద్ధి విడిచి ధీరులు; ......
కేనోపనిషత్తు: I. 2

"సింగరి దాసుని సేవించుచు సు
పొంగుచు మదిలో - పూర్ణత బొందెను"

ఈ సింగరిదాసప్రోక్త మహావాక్యముల ధోరణియె వారి రచనలన్నిటియందు గానబడును. అందు, వినయమునకు లోటులేదు కాని, అమిత గాంభీర్యము గలదు; అహంకారము లేదు కాని, అధికారము గలదు; మాధుర్యము లేదు కాని, విశ్వాసము గలదు; తర్కము లేదు కాని తత్త్వము గలదు; శాస్త్రప్రమాణము లేదు కాని స్వానుభవప్రమాణము గలదు. శ్రీ సింగరిదాసు, భక్తశిఖామణియగు రామకృష్ణ పరమహంసవలె, విద్యలం దారితేరకున్నను ఆత్మోపలబ్ధి పూర్ణముగ బడసి ధన్యులైరి.

III

సఖేతిమత్వా ప్రసభంయదుక్తం, హేకృష్ణ, హేమాధవ, హేసఖేతి.
అజానతామహిమానంతవేదం, మయా ప్రమాదాత్ప్రణయేన వాపి,
యచ్చావహాసార్థ మసత్కృతోఽసి, విహార శయ్యాసన భోజనేషు,
ఏకోఽథవాఽప్యచ్యుతతత్సమక్షం, తత్క్షామయే త్వామహమప్రమేయమ్

(శ్రీ మహిమ తెలియక నా స్నేహితుడవే యని తలంచి యజ్ఞానమున గాని చనవున గాని నేను నిన్ను 'ఓకృష్ణ' అనియో, 'ఓయాదవ'

అని కృష్ణా, యాదవా, సఖా పిలిచియున్నానో. ఆటలందు గాని విరామమందు గాని, కూర్చుండిన సమయమున గాని పరుండిన సమయమున గాని, ఒంటరిగ నున్నప్పుడు గాని యితరులతో నున్నప్పుడు గాని నేను నిన్ను హాస్యమునకై గౌరవింపకున్నచో, అప్రమేయుడవగు ఓ అచ్యుతా! నన్ను క్షమింప వేడెద.)

భగవద్గీత : XI. 41, 42.

శ్రీ సింగరిదాసు నిరాడంబరముగ కుటుంబములోను సంఘములోను అతిసామాన్య జీవితము గడపిరి. వారు 76 సంవత్సరములు జీవించిరి. మొదటి 25 సంవత్సరములలో శైశవము పోగా మిగత కాలమంతయు భక్తిపిపాస గలిగి ప్రపంచ ధోరణిలో పడనేరక హృదయాందోళనముతో నొక విపరీత వ్యక్తివలె చరించిరి. తరువాతి 50 సంవత్సరములు మోక్ష సోపానముల నధిరోహించుచు చిరనూతన వికాసము బడయుచు తమ యాత్మానందమున తాము నిమగ్నులై చేరిన వారలకు నిరతము భక్త్యుత్సాహముల బురికొల్పుచుండిరి. తమకు తాముగా తమకంటె నధికులైనవారి జేరి ప్రబోధము బడయుచుండిరే గాని తమకంటె వెనుకబడి యున్నవారి సమీపించి బోధసేయ బూనలేదు. వారలు తమంతట దాము తమవద్దకు వచ్చి యాశ్రయించినప్పుడే వారి యోగ్యతలకు దగినటుల వారికి నుపదేశము చేయుచుండిరి. అవ్విధముగ మకరందము కొరకు పుష్పమును జేరు మధుపములవలె పలువురు-

పురుషులు, స్త్రీలు, బిడ్డలు సయితము — వారి చుట్టును వారు నివసించుచుండిన ప్రతిగ్రామములోను చేరుచుండు వారు. వా రనివార్యముగ ప్రతిరాత్రి భోజనానంతరము తంబుర మీటుచు సలిపెడు మధురగానము, ఏసందర్భమున ఎవరితో ఏమాటలు వచ్చినను వారు చూపెడు భక్త్యావేశము, దీనుల యెడ వారు కనపరచు కనికరము, పసిపిల్లలతో వారు మెలగు సహజరీతి అత్యంతాకర్షణీయములు. వారి శుశ్రూష బడసి యుపదేశముల నంది ధన్యుల మైతిమని యానందించిన శిష్యులు వారి కన్నిచోట్ల నేర్పడిరి. తన వారు, పెరవారు అను భేద భావముతో వా రెన్నడు వ్యవహరింపలేదు. అట్టి దివ్యప్రభా వముతో వారు జీవించినను, వారితో సదా యుండియు నది గ్రహింపకుండినవారు లేకపోలేదు. లౌకికకార్యములందె యెల్లప్పుడు మునిగిపోవు విషయాసక్తులును, హిందువులు మూఢులని, వారి మతము, సంస్కృతి, సంప్రదాయము గర్హ్యము లని తలంచు ఆంగ్లమానస సంభవులు సింగరిదాసునె గాదు, ఎంతటి హిందూభక్తునినైన తృణీకరింప సమర్థులె. వీరి యభిప్రాయమునుబట్టి హిందూమహాత్ముల విశిష్టత యెప్ప టికి నిరూపితము గాపోవుటలేదు. తల్లి దైవము, తండ్రి దైవము, గురువు దైవము, అతిథి దైవము, రాముడు దైవము, కృష్ణుడు దైవము, సీత దైవము, కాళి దైవము, అగ్ని దైవము, నది దైవము, మెట్టు దైవము, చెట్టు దైవము, వేయేల 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని విశ్వసించు వారు హిందువులు. ఆ భావము

విస్మరించినచో, తిరిగి ఆస్ఫురణ కలిగినతోడనే పశ్చాత్తాపపడి, అర్జునుడు శ్రీకృష్ణునితోవలె, మొఱ్ఱపెట్టుకొని క్షమాపణ వేడుకొందురు. పరమేశ్వరుని క్రైస్తవ మహమ్మదీయ మతస్థులు విశ్వాతీతునిగను, హిందువులు విశ్వవ్యాప్తునిగను విశేషముగ భావన చేసి యారాధింతురు. భగవంతుడు విశ్వాతీతుడును విశ్వవ్యాప్తుడు నగుట వాస్తవము. విశ్వాతీతుడు ఏయూర్ధ్వలోకవాసుడో యని, విశ్వవ్యాప్తుడు ఏ పరిమితరూప బద్ధుడో యని వికసింపని శైశవ బుద్ధికి దోచును. కాని వికసించిన బుద్ధి విశ్వాతీతమును విశ్వవ్యాప్తమునైన యనంతమునే ప్రతి సాంతమున దర్శింప నేర్చును. అట్టి దివ్యదృష్టి గలవారు జ్ఞానులని భగవద్గీత,* ధీరులని ఉపనిషత్తు• ప్రశంసించు చున్నవి. ఆ సిద్ధపురుషులు భారతవర్షముననె గాక పాశ్చాత్య ఖండములందును గలరు. ఆర్యమహర్షులు, పౌరాణికభక్తులు, తాంత్రిక భక్తులు, రామకృష్ణాది నవయుగభక్తులు భారతదేశమునను, అనంతపురుషుని క్రీస్తుమహాత్మునియందు గాంచిన మార్టినో అను నాంగ్లతత్త్వవేత్తయు, వీరపురుషులందు సాక్షాత్కరించిన

---

* తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే.

(వారిలో నిత్యయుక్తుడును అనన్యభక్తుడు నయిన జ్ఞాని శ్రేష్ఠుడు.)

భగవద్గీత : VII - 17.

• భూతేషు భూతేషు విచిత్య ధీరాః......

(ప్రతిభూతమందు పరమాత్మను సాక్షాత్కరించి ధీరులు...)

కేనోపనిషత్తు : II. 5.

కార్లైలు అను నాంగ్లభక్తశిఖామణియు, పుష్పములందు ప్రత్యక్షము జేసికొన్న ఎమర్సన్ అను అమెరికా విజ్ఞానవేత్తయు, వీరిని బోలిన క్రైస్తవ భక్తులు పలువురును పాశ్చాత్యదేశము లందును ధీరభక్తులె. క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు మొదలగు సర్వమతమూలపురుషులు ధీరభక్తులె. ప్రవక్తలు ప్రతి యుగమున ధీరభక్తి పురిగొల్పుటకె పాటుపడిరి. భగవదను గ్రహమున నెల్లరు శైశవభక్తినుండి క్రమముగా ప్రౌఢభక్తి లోనికి పెరుగగలరు.

శ్రీ సింగరిదాసు ఒసంగిన సందేశము వినుడు. 'నారాయ ణుడే నరరూపధారుడే' యని, 'కృష్ణు జిష్ణురూపు' డని, 'తత్త్వ మసియనెడు మంత్రతత్త్వ మెరుగు' మని, 'బ్రహ్మమె సగుణ మురా, బ్రహ్మమె నిర్గుణమయి డనరా' యని, 'స్థూలము నిధిధ్యాస నొందిన, సగుణ నిర్గుణములు తానె యగు' నని వారు గానము చేసిరి. అట్టి దివ్యానుభవముల బడసి యాదర్శపురుషులైరి. గురువులను మహాత్ములను భగవత్స్వ రూపులుగ మన్నించిరి. కాళివిగ్రహమందు జగన్మాతృ స్వరూపము ప్రత్యక్షము జేసికొన్న శ్రీరామకృష్ణునివలె, శ్రీసింగరిదాసు తాము వసించిన బాపట్ల, పొన్నూరు, అమృ తలూరు, నూజివీడు, రేపల్లె, వెంకటాపురము మున్నగు గ్రామములలోను, తాము యాత్రలు సలిపిన నెల్లూరు, తిరుపతి, తిరువక్కోళి, రామేశ్వరము మొదలగు తీర్థస్థలముల

లోను గల దేవతావిగ్రహములందు దేవత్వము గాంచి యట్లు తమ గీతములలో ప్రస్తుతించిరి. బ్రహ్మానంద మనుభవించుచు బ్రహ్మానందము గానముచేసి బ్రహ్మానంద సరస్వతి యని ప్రస్తుతిగాంచిన వారు శ్రీ సింగరిదాసు. వారి హృత్కథాగాన సుధ నెకొందరైనను స్వీకరించి తమహృదయముల నింపుకొని యితరుల కందింతురను నాశతో జేయబడిన యీ గ్రంథప్రచురణ కృషి సఫలిత మెందు గాక ! కా॥ హ॥

ఓమ్ తత్సత్

# మున్నుడి

మహాపురుషుడగు భక్త శ్రీసింగరిదాసుయొక్క జీవిత విశేషముల గ్రంథరూపముగ 1941 వ సంవత్సరమున శ్రీవారి శత వార్షిక జయంతి కానుకగా బ్రచురించి యుంటిమి. దాన శ్రీవారి ఆధ్యాత్మికోన్నతియు సర్వానుభవసంపన్నతయు, సర్వ సాధకోపయుక్తతయు ప్రస్ఫుటము. ఆజీవిత చారిత్రమున అందంద శ్రీవారి కొన్ని రచనలను జేర్చియుంటిమి. కాని అవి అసమగ్రములై యుండుట సువిదితము. శ్రీవారి జీవితాంశములు సాధకలోకమున కెంత ఆదర్శప్రాయములో అంత యుపకారులగు రచనలు గూడ ప్రచురించుట ఉచితమని మా భావము. కాన శ్రీవారి కృతులనుండి కొన్నిటిని మాత్ర మిందు చేర్చి ప్రకటించుచున్నాము. సాధకచయము వీని తగు రీతి నుపయోగించుకొందురు గాక అని ఆశించుచున్నాము.

ఈపురుషశ్రేష్ఠుని రచనలగూర్చి యొకించుక ప్రసంగించుట అవసరమని తోచెడిని. చిరప్రాయంబున సద్గురు సీతాంబా యోగినీసన్నిధానమున తారకాది మహామంత్రముల నుపదేశమైనదాది సింగరిదాసమహాశయుని హృదంతరాళము నిరుపమానభావపరంపరలచే, తీవ్రజిజ్ఞాసావిభూతిచే, పూర్ణమైనదై, అట్టి నిర్వేదరసాయనము ఆహృదయకుహరమునుండి యుబికి పొంగి వదన సీమనుండి కీర్తనాప్రవాహమై బహిర్గత మగు

చుండెడిది. ఆ భగవద్విరహావేదనాసమయముల హృదయవిచ్ఛే దకముగ బయల్వెడలిన పాట లతివిషాదకరములై శ్రోతల కావేదనమును గలుగజేయునవిగా నుండును. ఆ కృతిసము దాయము వీరి భగవద్దర్శన పూర్వ విరహ స్థితుల ప్రతిబింబించు చుండుటచే సాధక సింగరిదాస హృదయసీమను వ్యక్తపరచును. తిరుమల మొదలగు పుణ్యభూముల శ్రీరామచంద్ర కరుణా కటాక్ష వీక్షణములచే ఈశ్వరసాక్షాత్కారము నొంది, హృదయగత ఆవేదనాగ్ని యుపశమిల్లినయంత రచితములగు కీర్తనాభాగము మిగుల నిత్యానందదాయకమై, "ధన్యుడ నైతిని," "నా జన్మ సఫలము" "తల్లి దర్శన మాయెను" "ఆనందం" మొదలగు కీర్తనలలో వలె ఆత్మతృప్తినే గాక, తా ననుభవించుచుండు బ్రహ్మానందస్థితిని, వర్ణించుచు, విను వారల కమందానంద రసముల వెదజల్లుచున్న దనుట కెట్టి సంశయము లేదు. ఈ భాగము భగవత్సాక్షాత్కార మహా భాగ్యమున ఆప్తకాముడైన సిద్ధుని చిత్తవృత్తిని చాల చక్కగా వివరించుచున్నది. అట్టిమహదానంద సంభరిత చిత్తమున తా ననుభవించిన, శ్రీరామ, సీత, నరసింహ, నారాయణ, శివ, కృష్ణ, రుక్మిణి, పార్వతి, రాజ్యలక్ష్మి, మొదలుగాగల దేవతా గణ దర్శనవిభూతిని, తజ్జనిత తన్మయతను, ఈ భాగము వ్యక్తము చేయుచున్నది. క్రమవిధానమున ఇట్లు సిద్ధత్వము నొందిన శ్రీసింగరిదాసు పెక్కు శిష్యులచే పరివృతుడై బోధించుచుండు కాలమున వ్రాయబడిన పాటలు బహుళ

భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధకములై, ఆధ్యాత్మికానుభవ రహస్య సంకీర్ణములై సరళములై యొప్పారుచున్నవి. మరియు నొకే నామమునందు చిత్తమును లయింపజేసి ఏతన్నామద్వారమున తన్మయతను గాంచి భగవదనుభవానందసంపద నొందజేయు నామసంకీర్తన విధానముగూడ వీందు బొడగట్టును. ఈవిధముగ శ్రీవారి రచనలు చతుర్విధ కీర్తనావిధానముల బొంది వారి సాధక, సిద్ధ, బోధక, జ్ఞాన స్థితుల రూపొందించుచుండుటయే గాక, ఆయా స్థితులనున్న జిజ్ఞాసువుల కమూల్యోపయుక్తములై రాజిల్లుచున్నవి.

ఈ భక్తాగ్రేసరునికి భక్త్యావేశజనితమగు నాశుకవిత ప్రాప్తించుటచేత, లిఖితముల సరిజూచు నభ్యాసము వీరికి లేకుండుటచేత, అందందుకొలది భాషాలోపములు కన్పించును. కాని సహజకవితా మాధుర్యము లన్నియు ఈరచనలందు ప్రస్ఫుటములు. ఇది యంతయు శ్రీరామచంద్ర కృపాజనిత అసాధారణ ఆశుకవితా స్రవంతియె యని నిస్సందేహము. సమయముల పాటించని యీ ఆశుకవితా ప్రవాహము, అనవరతభక్త్యున్మత్తత నుండు వీరిచే లిఖితము గాక యధిక భాగము అదృశ్యము. మరియు వీరినెవరేని ప్రశ్నగావించినచో, వారి కోర్కె దీర, అచిరకాలముననే గద్యపద్యగీతములతో నొక గ్రంథమును రచించి యొసంగుట పరిపాటి. ఆగ్రంథరాజములు శిష్యవర్గముతో మననుండి మరుగుపడిపోయినవి. అయి

నను వానికై యన్వేషింప అతిస్వల్ప గ్రంథమే మాకు లభించి నందులకు చింతించుచున్నాము. లభ్యమైనది సుమారు 300 పుటల గద్యము 200 పుటల కీర్తనాదులును మాత్రమే. అందుండి శ్రీవారు భౌతికశరీరధారులై యున్న 76 వత్సరముల సూచికముగ 76 కీర్తనలమాత్రము ఈ ప్రచురణమున చేర్చి యున్నాము.

ముముక్షువు లిందుగల శ్రీ సింగరిదాస మహాభక్తుని సుకవితా మాధుర్యమును భావవిశిష్టతను ఆస్వాదించి, బ్రహ్మానందవాహినీరసముల మైమరచి, భాసమాన భక్తిజ్ఞాన వైరాగ్య చంద్రికల మున్గి పునీతులై, సంతత జనన మరణ సంసృతి చక్రభ్రమణమునుండి విముక్తులై యొప్పారుదురు గాక అని ఆశించుచున్నాము.

అనుభవానంద

అనుభవము

మానవ ప్రబోధ

స్వానుభూతి

విజ్ఞాన దీప్తి

సంగ్రహము

# అనుతాపము

కీర్తన: శ్రీ రామా! నను గన్న రామా!

,, ఎంత పని చేసితివి రామా!

,, రామదేవా! రక్షింపవేగా!

,, రామమోహన రామా!

,, ఏ మయ్యా! సీతారామయ్యా!

,, రామయ్యా! నీ మోము జూపు మయ్యా!

,, రామా! నిన్నే నమ్మినారా!

,, జయరామ! నీ నామ - జపమునె నమ్మితి

,, ఏమి సేతును రామ!

,, రామ! నిన్నే నమ్మినానురా

,, అపకారంబుల చేసితి నని

,, దాశరథీ! దయజూడుమా

,, రారా రామన్న!

,, రామ! నన్నేలరా

,, ఏల దయ రాదు? - రామయ్యా!

,, అపరాధినైనా - రామయ్యా!

,, వింటివా - రామ - వింటివా?

,, సింగరిగిరి నరసింహా!

,, లక్ష్మీనృసింహా! రాగదే

,, ఏమి సేయ దలచితో గదా?

# మానస ప్రబోధ

# స్వానుభూతి



# విజ్ఞాన దీప్తి

## మంగళము

ఓమ్

# ముముక్షు చరిత్రము



## అనుతాపము

**1** పున్నాగ రాగము - అట తాళము

శ్రీ రామా! నను గన్న రామా! ॥శ్రీ॥

శ్రీరామా! నను గన్న - కారణరూపుడవు.
నేరము లెంచక - జేరి బ్రోవు మయ్యా! ౧

నిన్ను నమ్మిన నన్ను - గన్నడ సేయ కా
పన్నుని రక్షించి - మన్నించి చేకొనుము. ౨

ఇతరదైవము నొల్ల - పతితపావన! నిన్ను
సతతము నమ్మితి - జతకు రావేడెద. ౩

ఆరు శత్రుల నణచి - కోరిక లీడేర్చి
ధారాళముగ నాకు - దయ సేయవె రామ! ౪

వాసిగ సింగరి - దాసుడ నీ కెపుడు
దోసి లొగ్గి దయ - కాశించి యున్నాను. ౫

2 నాదనామక్రియ రాగము - అట తాళము

ఎంత పని జేసితివి రామా! - ని -
    న్నేమనందును సార్వభౌమా!
పంత మేటికి జేసి - పలుబాధలను బెట్టి
    చెంత జేరిన నాదు - చింత మాన్ప వదేమి? ౧
ముందు బ్రోచిన వారి నెల్లా - స్వామి -
    విందు; నే పన్నుగా నెల్ల
సన్నుతించెద; యా - పన్నునిగ జేయు, రా
    వన్న! నాకన్నులను - నిన్ను జూడక మాన. ౨
మిమ్మె నమ్మి యున్నవాడ - చాల
    మమ్ము గృప నేలవే దేవ!
రమ్మనిన నేను మీా - సమ్ముఖంబున పా
    దమ్ములను గొల్చుచును - ఇమ్ముగా నుండుదును. 3
పొన్నూరు శ్రీభావదేవ! - మమ్ము
    తిన్నగా బ్రోవవే దేవ!
వెన్నుడా! నిను నమ్మి - యున్న సింగరిదాసు
    విన్నపం బెన్నడును - వీనులతో విననైతి. ౪

3 పున్నాగ రాగము - అట తాళము

రామదేవా! రక్షించవేరా! రామదేవా!
  రామదేవ! మమ్ము - ప్రేమతో రక్షించి
    కామితార్థము లిచ్చె - ఘన పుణ్య చరితా! ౧

పతిత పావనుడవు - పరమ పురుషుడవు
సతతము నిను వేడి - సన్నుతించెద నయ్యా. ౨
మాయరూపము దాల్చి - మహిమీద జనులను
బాయక సంసార - భ్రాంతి జేసితివే. 3
మున్ను భక్తుల నెల్ల - చెన్నుగా బ్రోచి నే
సన్నుతించిన రా - వన్న! శ్రీరఘురామ! ౪
భద్రగిరీశుడ! - భవ్యచరిత్ర! నీ
పద పద్మములను నే - వదలను; బ్రోవర! ౫
నూజివీడు నందు - రాజగోపాలుడవై
గజరాజు బ్రోచిన - ఘనుడవౌ శ్రీరామ! ౬
శ్రీ వెంకటేశ్వర్లు - శ్రిత జన పోషకుడు;
అవ్యయానంతుని - ఆశ్రయించితిని. ౭
బాయక నిను వేడి - భరియింపు మన్నాను;
జయము సింగరికవికి - జయము శ్రీరామ! ౮

**4** నాదనామక్రియ రాగము - ఆది తాళము

రామ మోహనరామా! - రఘు - రామ! త్రిభువనధామా!
రామా! దనుజ వి - రామా! దశరథ
రామా! మునికుల - కామా! రఘుకుల॥ ౧
నిన్నే నమ్మితి రామా - న - న్నిరతము బ్రోవుము రామా!
కన్నడ సేయకు రామా - నను - గరుణతో జూడుము
రామా!

తన్న తండ్రివని - విన్నవించితిని,
సన్నుతించితిని - మన్నన చేయుము. ౨

రవికుల భూషణ రామా - రా - జీవ నయన శ్రీరామా !
భవముల బాపవే రామా - నీభారం బంటిని రామా !
పావన మూర్తివి - పాలన సేయవె ;
సేవ జేసెదను - సింగరిదాసుడ. ౩

## 5 పున్నాగ రాగము - ఆది తాళము

ఏమయ్యా ! సీతారామయ్యా ! - ఎన్నడు మిముజూతునయ్యా !
ఏమయ్యా ! రామయ్య - నామీద నెనరుంచి
ప్రేమతో రక్షించు - స్వామీ జానకీరమణ ! ౧
ఈమాయ మహిమలు ఎంత విచిత్రమో !
కామమ్మునను మిమ్ము - గానకుందు రయయో ! ౨
శర ణంటి మొర యంటి - కరిరాజ వరదుడ !
ధరణి సింగరిదాసు - నరసి బ్రోవర తండ్రి ! ౩

## 6 నాదనామక్రియ రాగము — ఆది తాళము

రామయ్య ! నీ మోము జూపు మయ్యా - నాకు
కామితార్థము లిచ్చి కావుమయ్యా !
రామా రామా యని - ప్రేమతో బిలచిన
ఏమరకను నన్ను - నేలు జానకిరామ ! ౧

చయ్యన ధర సింగ - రయ్యను బ్రోవుమా !
అయ్య ! వేడెదనయ్య - నెయ్యము నేలుమయ్య ! ౪

## 7 ఆనందభైరవి రాగము - ఆది తాళము

వింటివా - రామ - వింటివా॥ శ్రీరామచంద్ర !
వింటివా యీ కాటకంబున - వింతగా జనులెల్లఁ జుత్తున
నంటె మిక్కిలి వగతు రయ్యా యో - అంబుధారల నుంచి
గావుము ! ౧
జీవుల కన్నిటికిని - జీవనోద్ధారకుడ వీవు !
బ్రోవు జాగుచేయకింక - బింకమున నెటు లోర్తు
రయ్యా ! ౨
ఖరనామ సంవత్సర - కార్తీక మాసమందు
కరువు ప్రాప్తం బాయె నిప్పుడు - కనికర ముంచుము,
స్వామి ! ౩
నందన సంవత్సరము - అంతకంతకు కటువు యగునని
కుందు చుండెడు జనులు భీతిని - జెందకుండగ బ్రోవు
కృపను. ౪
దీన జనులను గాచు బిరుదు - దేవర వారిదే గాక
మానసంబున నన్యులకు ము - మ్మాటికిని లేదనుచు
మ్రొక్కెద. ౫
అన్నగత ప్రాణులనుగ నాదిస్సృష్టి నుద్ధరించి
అన్నపానము లేక జేసిన, - నావల నింకెవరు దిక్కు ? ౬

కావుమయ్యా! కరుణచేతను - కల్పవృక్షమువలెను మమ్ము ;
బ్రోవ సమయం బనుచు వేడితి - బుద్ధావతార! శరణు. ౭

భువిని సింగరిదాససేవిత - భద్ర పాద సరోజ సీతా
దేవి గూడియు మమ్ము బ్రోవుము - దశరథ నందన
రామ! ౮

**18** ఆనందభైరవి రాగము - ఆది తాళము

సింగరిగిరి నరసింహా! మిమ్ము
సేవించినా నయ్యా! శ్రీ నరసింహా!
సేవకునిగ జేయు మయ్యా! - నాకు
స్వానుభవ మేప్రొద్దు సమకూర్పు, మయ్యా!
కావగ గృప జూడు, మయ్యా! - దేవ
దేవుడ వని నమ్మి కోరినా, నయ్యా! ౧

భక్తుడ బాలించు, మయ్యా! - రామ
పావన నామమే భజియింతు, నయ్యా!
ముక్తిని జేకూర్పు, మయ్యా! - సద్గురు
మహిమచే సమ్మోద మొందితి నయ్యా! ౨

సింగరి దాసుడ, నయ్యా! - ప్రభూ!
శ్రీ మనోహరుడ! మిమ్ము శరణంటి, నయ్యా!
జగదీశా! రక్షించు, మయ్యా! దేవ!
సత్యమ్ము నీ యాజ్ఞ జరియింతు నయ్యా! ౩

9 ముఖారి రాగము - అట తాళము

లక్ష్మీనృసింహా! రాగదే - మీ - లక్ష్యానుసంధానమీగదే;
లక్ష్మీశ! నా మనో - నిక్షేపమూర్తి! మీ
దాక్షిణ్యమూర్తి నన్ - రక్షింపు మో, తండ్రి! ౧
ఇక నీచజన్మ నాకెందుకు - మీ - యంశములో జేర్ప
వెందుకు?
జీవావస్థ భ్రమల - జిక్కించి సంసార
మోహబద్ధుల జేసి - మోసపుచ్చగ నేల? ౨
పలుబాధల బడజాలనే - మీ-భక్తి గల్గిన నాకు జాలునే?
చలము సేయకు; మీ - చైతన్యమునె గాద?
నలువను గన్నయ్య! - నాయండ నీ వయ్య! ౩
ఈజన్మలోనె ముక్తి నియ్యరా - ఈ - యిడుమలనుండి నన్
గావరా;
హా జనకా! నన్నేలు - హా నాథ! పడజాల;
గజరాజ వరదా! నా - గతి నీవే; నమ్మితి. ౪
ఉన్నవిధము విన్నవించితి - నా - యుపకృతికై యెదురు
చూచితి;
కన్నతండ్రి వేమో - కలుషజన్మల బాపి
మన్నింపవే, జగ - త్సన్నుత! దయజూచి. ౫
పంతము సేయకు మంటిని-నా-బంధము దొలగించ మంటిని;
అంతరంగమునందు - సంతస మొందించు
అంతర్యామి! నీదు - చెంతను జేరితి. ౬

ఏక స్వరూపుడ వౌదువే; -నే-మీా కన్యగాను; చేకొ౯దే.
సంకర్షణుడవైన - సర్వేశ! నీమహిమ
ఏక భావము నిచ్చి - ఆనంద మొందించు. ౭
సింగరిదాసుడ నంటిని - మీా - సేవకు నెరనమ్మి యుంటిని
సింగరిగిరివాస! - శ్రీ నృసింహ వేగ -
మంగళ మొసగవె - మహనీయ మూ౯ర్తివె. ౮

## 20 తోడి రాగము - ఆది తాళము

ఏమి సేయ దలచితో గదా? - ఈ కర్మఫలము
నేమి సేయ నుంటివో గదా?
ఏమి సేయ దలచితో? - ఏమి దోచ దాయెనే!
ఏమి పూజ జేసికొంటినో? - ఏమి లిఖిత మున్నదో? ౧
ఎంతని మొరబెట్టు కొందును? - నా మనవిని విని
చెంతకు రా వేమి సేతును?
సంతతమ్ము నమ్మియున్న - పంతముచేయుట మేలా?
చింత దీర్చి బ్రోవవలెరా - కంతుజనక! గావరార. ౨
నీదు మాయ గాంచగా వశమా - నీ దయ లేక
మోద మొంద నరుని శక్యమా?
ఖేద మోదమందు జిక్కి - బాధ నొందు పామరునికి
బాధ లన్ని సున్న జేసి - ఆదరించి బ్రోవ నీవె. 3
మహిని బుట్ట జాల నంటిని - నీ చరణముల
సహానమున మరువ కుంటిని;

ఊహాపోషణమ్ములచే - హేయ సంసారమందు
మోహ భ్రాంతు లణగించి - మోక్షసుఖము నిమ్మ
దేవ! ౪

నిన్ను నమ్మకున్న వాడరా - నా తనువు నీదు
సొమ్ముగాను ఏలు, భూవరా!
క్రమ్ముకొనిన శత్రువులను - జిమ్మి నాదు కోర్కె లిమ్మ
కమ్మవిల్తు గన్న తండ్రి! - కావుము, శ్రీరమా
రమణ! ౫

సింగరిగిరి వాస ధీమణీ! - భవహరుడ! శ్రీ
రంగ నిలయవాస భూమణీ!
మంగళ ప్రధానమైన - మధురమైన నీదు యంత
రంగ మందు జేర్పు ము - పొంగుచు శరణంటి, రామ ఉ
ధరను సింగరి దాసుకు హరి! - కరివరద!
చరమ పదవి నిమ్ము వేగమే;
మురహర! మును దాసులందరి - కరుణ బ్రోచు టెల్ల వింటి
అరమ రేల? నన్ను నీ - దరిని జేర్చ వేడుకొంటి. ౬

**21** పున్నాగ రాగము - ఆది తాళము

పన్నగశయన మూర్తి - మము - మన్నించుము
కృష్ణ మూర్తి!
చిన్నతండ్రి నను - దిన్నగ బ్రోవవే;
పన్నగ ధర నుత - పరమ దయానిధే! ౧

వసుదేవ వరతనయా - నాతో - వాద మేల ? నో యయ్యా !
ఆస జెంది మి - మ్మాశ్రయించితి; నా
లస్యము జేయక - గాసి దీర్పవే. ౨

వందన మిదె, గోపాలా - ముద్దు - నంద తనయ ! భూపాలా
వందనీయ ! మా - డెందము భజియింప
పొందు పరచు, మో - మందరధర ! కృష్ణా ! ౩

ధర సింగరిగిరి వాసా - శ్రీ - నరహరి దివ్యవిలాసా !
దొరవె సింగరిదాసు - నేలవే వేగమే !
వరదా ! వేడెద కరుణాకర ! రామ ! ౪

## 22 ...రాగము - అట తాళము

పార్థ సారథే ! - పాహి దయానిధే !
పార్థసారథే ! మీ - పాదార విందముల
సార్థకముగ జన్మ - సఫలము జేయరా. ౧

పంతమేల నా - పన్నుడ గావ ? నీ
చెంత జేరి యున్నాడ - చింత బాపి ముక్తినిమ్మ ;
కంతుజనక ! జగద్రక్షా - నంతగుణాఢ్యరక్షా ! ౨

తిరువళిక్కేళిని - త్రిజగ ధరుడవై, శ్రీ
పరమ పావనమైన శ్రీ - పతివై, ధరను సింగరిగిరిని
నరహరివై, భక్తులను - అరసి బ్రోవ వెలసిన ౩

మదిని గోరి నీ - మహిమ వింటి, నా
హృదయవాస చిన్మయుడ! - బాధలు బాపు దొరవని;
పాదసేవ సింగరిదాసుకు - పొంకుపరచి మోక్షమిమ్మ ౪

3 ముఖారి రాగము - త్రిపుట తాళము

వెంకటేశ! నమో నమో - వేదవేద్య! గావవేమో;
సంకటముల బాపవేమో - ఇంక నన్నేలవేమో! ౧
వెతల నోర్వజాలనో - వెదకి నిన్ను జేరితినో;
గతి పతి వనుకుంటినో - కలుషప్రాపంచకుడనో! ౨
ఆత్మరూప! నీవె నా - యెదను గల్గు స్వామివే;
ఆత్మైక్య భావ మొసగి - ఆదరించి నన్నేలు, తండ్రి! ౩
ఇహ పర సుఖంబులు - ఏహ్య పదవు లగుటచే,
బ్రహ్మజ్ఞానము నొసగి - బ్రహ్మపద మియ్యవయ్య! ౪
ఇడుమల బడు జన్మల - జడిసి మిమ్మె వేడుకొంటి,
నిండు దయ జూచి మీలో - నైక్యము జేయవేగమే. ౫
తీర్థవాసమైన యా - తీరైన తిరువక్కోళిని
పార్థసారథి స్వామి వే, గో - వర్ధన గిరిధర కృష్ణా! ౬
తీర్థ పావనుండవే - తిరుమల నివాసుండవే;
ప్రార్థించెద, నన్నేలవే - పురాణ పురుషుండవే. ౭
మిమ్మె నమ్మినాడను - మిగులు దేని గోరను;
రమ్మె; అభయహస్త మిమ్మె; మీ - సొమ్ముగ
బ్రోవు మికను. ౮

సింగరి దాసును నేలవే - సింగరిగిరి వాసుడవే ;
రంగరాజ ప్రభుడవే - రామ ! నా మనవి వినవే. ౯

## 24 నాటకురంజి రాగము - అట తాళము

పరమ పావని రుక్మిణీ - మిమ్ము
భజియింతు, శ్రీకృష్ణు రాణీ !
పరమైన మీదివ్య - పాదార విందములె
స్థిరముగ వేడెద - సిరు లియ్యవే, జనని ! ౧
ఇహమందు యిడుమల బెట్టకు - నా
యీప్సిత మీడేర్చ వెందుకు ?
ఇహపరాదుల కెల్ల - నింక నెవ రున్నారు ?
ఊహాపోషణ లిచ్చి - సోహం భావము నిమ్మ. ౨
సింగరిదాసుడ నంటిని - సింగరిగిరి
శ్రీనరహరి నమ్మియుంటిని ;
అంగనామణిరో ! ని - న్నాశ్రయించిన నన్ను
భంగము సేయక - పరమ పద మిప్పించు. ౩

## 25 నాదనామక్రియ రాగము - అట తాళము

కరుణించు, రాజ్యలక్ష్మమ్మ ! మమ్ము
కరుణించకుంటే, మాగతి ఎవరో ? యమ్మ ! ॥క॥
తల్లి దండ్రియు మీ రమ్మా - తప్పు
లెల్ల మాన్ప వేగ దరిజేర్ప వమ్మా !

చల్లని దయ జూపు మమ్మా - తండ్రి
కెల్ల విధములనైన బోధింప వమ్మా! ౧
మున్ను నమ్మినవారి నెల్ల - మొదట
సన్నుతాంగుం డగసి బ్రోవడో చెల్ల!
పన్నుగ నిడుమల నెల్ల - జేయ,
కన్నతల్లి! నీవు కనిపెట్టు మెల్ల. ౨
పొంగు కృపారసము జల్లి - ఆ య
నంగ జననీ! యనుకంపను తల్లి!
సింగరి హృత్తటిద్వల్లి - జననీ!
చంగున దరిజేర్పవే కల్పవల్లీ! ౩

## 26 మధ్యమావతి రాగము - ఆది తాళము

పార్వతీ దేవి! - పాలింపు, మమ్మా!
దర్వీకరభూషు నమ్మి - దామోదరు దలచే ॥పా॥
పరమ పావన దేవి - పరమ కళ్యాణి!
పురహరు ప్రియసతి - వరదు నిరతము వేడే ౧
రాముని స్తుతి జేయు - రాజీవనేత్రి!
రామభక్తి నాకు - ప్రేమచే నొసగుము. ౨
భక్తుల రక్షించు - భద్రేభ గమనా!
శక్తియుక్తుల నీవు - భక్తి గలుగ జేయు. ౩
సింగరిగిరి వర - సింహ సహోదరి!
సింగరి దాసునకు - సిరు లిచ్చి రక్షించు. ౪

## 27 కేదారగౌళ రాగము - ఆది తాళము

సీతాదేవిని సేవించుటకై - చూతము రారె, చెలీ!
సిరుల నొసంగు నట - పరమ పద మిచ్చునట;
కరమొప్ప గాచు నట - వరము లొసంగు నట. ౧
భక్తుల బ్రోచు నట - ముక్తి లొసంగు నట;
రక్తి సాయుజ్య మిడునట - యుక్తుల బలుకు నట. ౨
పాపములు బాపు నట — కాపుదారి జేయునట;
దాపున జేర్చు నట — ఆపద లెగజిమ్మునట. ౩
రాముల భార్య యట - రామ దాసుల నట
ప్రేమతో బ్రోచునట - నా మొ రాలకించు నట. ౪
బాగుగ నన్నేలు నట - జాగేల సేతు నిట;
సింగరి దాసు నట - వేడుక బ్రోచునట. ౫

## 28 కాంభోజి రాగము - ఆది తాళము

సీతా మహాదేవి - సేవింతు, మాయమ్మా!
చిన్మయమూర్తి, వమ్మా!
భూతలమున మిమ్ము - నీతి దలచువారు
ఖ్యాతి గాంతు, రోయమ్మా! ౧
కన్నబిడ్డ కోర్కె - గడ తేర్చ తలిదండ్రుల్
కర్తలు గా, రో యమ్మా!
ఉన్నవిధము నే - విన్నవించి యుంటి;
మన్నన గాంచ, వమ్మా! ౨

అల్ప నరుడ ! యీ - ప్రపంచ మాయల
నలసి యుంటి, కొమ్మా !
బాలుని గాచు నా - రీతిని నను వేగ
భరియింప గద, వమ్మా! ౩

వాయు సుతుని బ్రోచి - వైభవ మొసగిన
వసుధపుత్రి, వమ్మా !
మాయల బెట్టకు - మ మ్మేలు శ్రీరామ
మగువ జానకి ! మా యమ్మా ! ౪

ధరను సింగరిదాసు - దయ జూచు శ్రీలక్ష్మి !
నరసింహు గొల్తు నమ్మ ;
క్షీరసాగరకన్య ! - సిరు లిచ్చి రక్షించు,
పరమపావని ! యో యమ్మా ! ౫

## 29 కాంభోజి రాగము - త్రిపుట తాళము

రాము నెడబాసియు నే - రాపిడి బడితినె, తల్లీ !
భామలపై భ్రాంతి జెంది - పాపి నైనాడ, నో తల్లీ! ౧
కాంచన చేలుడు - కనుల కగపడడాయె
ఎంచి కాచి యున్నవాడ - ఏలు మని జెప్పవే తల్లీ! ౨
కామజనకుని నామము - గాననైతి నే మున్ను
వేమారు దలచి మదిని - వేడుకునే వాడనే తల్లీ! ౩

విష్ణుమహిమలు దెలియ - కృష్ణు నుపదేశమె నాకు.
విష్ణుభక్తి నొసగుమమ్మ - వీడు నీచుడనకు తల్లీ! ౪

భక్తిగలుగజేయ నీవే - ముక్తినొసగి బ్రోవ నీవే.
భుక్తి ముక్తులివ్వ నీవే - భువనముల జననివె తల్లీ! ౫

గొడవర్తియందు వేణు - గోపాలస్వామి దలచి
చెడని పదవిగోరు నన్ను - జేపట్టి బ్రోవుముతల్లీ! ౬

సింగరి దాసునకును - సింగరిగిరీంద్రు డిపుడు
మంగళ మొనరింప జేయు - మగువ సీతమ్మ తల్లీ! ౭

---

30 పున్నాగ రాగము - ఆది తాళము

రామనామము జేయవే - ఓ మనసా!
రామనామము జేయవే.
రామనామము జేసి - రసికు లైరి మున్ను,
రమ్యముగా నుడువ - రక్షించు నని నమ్మ ౧

ఇతర చేష్టలు మానవే - ఇకనైనను,
పతితపావను దలపవే.
అతి సులభుడగు నా - త్రిజగత్కోటి రక్షకుని
మతివిహీనత నొంది - గతిమాలి తిరుగక ౨

పాతకుఁడైన నేమి? ప్ర - ఖ్యాతిగ
పద్మనాభుని దలచిన;
అతివైరి రావణుని - నతిసహోదరు లంకా
పతిగ జేయడే శ్రీ - మంతుడై స్థిరముగ. ౩

వరభద్రగిరి ధాముని - వర్ణించగను
యురమున గురి నిల్చునా?
కవిరాజవరదుని - ధరణి సింగరిదాసు
మరువక ధ్యానించు - నిరుపమానందుని. ౪

**31** యమునా కల్యాణి రాగము - ఆది తాళము

నారాయణ యనరాదా మనసా !
నరకము దొలగును ఓ మనసా !
నారాయణ యనకుంటే వేరొక
దారి లేదు, యెద నుంచవె మనసా !
నిత్యా నిత్య వస్తు వివేకము
నిరతము గనుగొనవే మనసా !
దాతలకును నెరదాత యైన మా
దశరథరాముల నమ్మవె మనసా !
ఇహాపరార్థ ఫల భోగ విరామము
ఇంపుగ గనవే మనసా !
బ్రహ్మాండ భాండము లన్నియు నిండిన
బ్రహ్మను దలపవె మనసా !
శమముఖ సంపదలను నారింటిని
నీమము జరుపుము ఓ మనసా !
ముముక్షుత్వమును మెండుగ గోరుము ;
సమధికగుణ హరి నమ్మవె.
ఐనాపురీ పుర భావదేవుని
పొంగుచు మదిలో నుంచవె మనసా !
చెన్న వెలసిన సాంబశివుని మది
సన్నుతించ రాదటవే మనసా !

ఆంజనేయులకు అర్చన సేయవే
అమిత పరాక్రము డతడే మనసా!
కంజదళాక్షానుజుని లక్ష్మణుని
ఘనముగ బ్రోచిన ఘనుడే మనసా! ౬

సింగరిదాస హృదబ్జ కర్ణికా
సంగతు డాయెను యో మనసా!
సింగరి గిరి నివాసుడైన శ్రీ
నరహరి నమ్మవే యో మనసా! ౭

## 32 కీర్తన

ఇవి యేడరా జీవా! నీ వేడరా జీవా!
ఇవియు వదలి యా నీవై - అనయము గనుముజీవా! ౧
నిర్వికారుడ వీవే - నిగమాంత వేద్యు డీవె;
ఉర్వి నిండియున్న - ఉపమాన శూన్యు డీవే. ౨
గొఱ్ఱె మందలో జిక్కి - కోల్పోవు పులిరీతి,
గోర్కెలలో జిక్కి - కుందు టేల నయ్యయ్యో! ౩
సింగరి గిరి వాసు డీవే - సింగరి దాసుడ వీవే;
అంగదేహ భంగమున - మంగళ విగ్రహుడ వీవే. ౪

## 33 ఆనంద భైరవి రాగము - ఆది తాళము

ప్రోడ చెప్పే జాడ జూడుమా - ఓ మనసా!
ప్రోడ చెప్పే జాడ దెలిసి - తోడనే క్రోడీకరించి
చూడవే, పాడవే - యాడవే, వేడవే.

చూడవే జగధీశు రూపము - పాడవే భగవంతు చరితము
ఆడవే ఆనంద మొంది - వేడవే శ్రీవేదవేద్యుని. ౧

కాలుని కడ కేగు వేళనే - కాలయాపన సేయు వేళనే!
చేలవే, పోలవే - తేలవే, త్రోలవే.

చేలవే గురుభావ మెరుగక - పోలవే గురుశిష్య సంతతి,
తేలవే సద్గురుని కృపను - త్రోలవే దోషౌఘములను ౨

ఎన్నగా నీ కన్నవారి - మన్నన మన కేల యనుచు
కంటివే, వింటివే - మంటివే, యుంటివే.

కంటివే సద్గురుని పదము - వింటివే శ్రీగురుని వాక్యము
మంటివే గురు మహిమవలన - యుంటివే యానన్న
త్యమున? 3

కాయ, గూయ, వ్రేయ, మ్రోయ - ప్రాయమందు హానిలేక
కాయవే, కూయవే - వ్రేయవే, మ్రోయవే.

కాయవే నీయింద్రియాదుల - గూయవే యనుకూల
వచనము,
వ్రేయవే యీ మాయామోహము - మ్రోయవే
గురుతత్వ నాదము? ౪

మాన, ఆన, పూన, గాన - మానసా ! నీ పరముగాన
మానవే, ఆనవే - పూనవే, కానవే.

మానవే యిక మమత సంసృతి - ఆనవే సుజ్ఞానసారము,
పూనవే యిక జన్మ రహితము - కానవే సింగరికవి
హృదయము ? ౯

34 యమునా కళ్యాణి రాగము - ఆది తాళము

చచ్చినవారల జూచి చూచి మరి - చచ్చేవారలు ఏడ్చెద రే !
చచ్చిన వారికి - ధర యస్థిరమై
చావని తనకు - స్థిరమై యుండునే ? ౧
ఇష్ట భోగములు జరుగక జరుగుటె - ఇలలో ఈశ్వరకృపయు
సుమా !
దృష్ట మన్నియు - నష్ట మనుచు గని
స్పష్టముగా హరి - భజన సేయుడీ. ౨
పాపపుణ్యఫల రీతిసరణి సం - ప్రాప్తమౌను మది గనుము
సుమా !
తాపము నొందక - తామసించకను,
శ్రీపతి గొల్వుము - శ్రేష్ఠత మనసా ! ౩
భువిలో సింగరిదాసును బ్రోచెడు - భూరమణీశుని గాంచు
సుమా !
శక్తితో ముక్తికి - భక్తవత్సలుని
భక్తి వెలయగా - భజియింపుమురా. ౪

## 35 మధ్యమావతి రాగము - ఆది తాళము

అన్ని నే గానని అన్నియు నేనని
    ఆనందించిన ధన్యు డగున్ ;
ఎన్నదగిన మానవ జన్మంబును
    నున్నజేయ సుజ్ఞాని యగున్. ౧
తాను గానిది తా ననుకొను టే,
    తప్పుడు త్రోవకు దారి యగున్ ;
తానే తానని తాను దెలిసిన,
    ధన్యత నొందగ మూల మగున్. ౨
దబ్బర మాయను దబ్బరనక మది
    దగిలిన, జన్మము వ్యర్థమగున్ ;
నిబ్బరముగ కామ మొకటి జయించిన,
    నిత్యానంద నిమగ్ను డగున్. ౩
పరమేశ్వరుని పరమ రహస్యము
    పండిత వర్యుల హస్తగతము ;
    నిరతము నిర్గుణబ్రహ్మమె సగుణ మ
        న్ని రూపముల నెన్న దగున్. ౪
నిశ్చయము వదలక నిఖిలాకారుని
        నియమముతో భావించ వలెన్ ;
    పశ్చాత్తాపము పాదు చేసికొని
        పరిపూర్ణుడవై మెలగవలెన్. ౫

సూయు ననుసరణ జేసిన వాడు
ముక్తిమార్గమున ముఖ్యుఁ డగున్ ;
మూటిని దెలిసి మూటిని యరసి
మూటి మూటి నే యుండవలెన్. ౭

సింగరి దాసుడు సింగరిగిరి వాసు
నైక్యము గోరుచు నుండు మదిన్ ;
అంగనామణుల భ్రాంతిని నొందక,
నఖండభావము నొందు మదిన్. ౭

## 36 నాట రాగము - ఆది తాళము

సాంబశివుని దలచవే - ఓ మనసా - సాంబశివుని దలచవే
సాంబ శివుని దలచి - సత్కృప గని సంసా
రాంబుధి గడతేర - రాజువై యుండవే. ౧
హరిహరాదుల నొకరి - హాస్యము సేయకు ;
హరి హరులకు నెపుడు - అరమర లేదు వినవే. ౨
కరములు నొవ్వ శివుని - కరమర్థి బూజించి,
హరినామ మే వేళ - మరువక దలచవే. 3
దయయు సత్యంబును - తప్పక జరుపుము,
దయవల్ల గలుగును - దమతప మోక్షపదవి. ४
సింగరిగిరివాసు - సింగరయ్యను బ్రోచు
భంగ పరచి నార్గుర - భక్తి భావన నింపి. ౫

**37** ఆనందభైరవి రాగము - ఆది తాళము

జ్ఞానము - సుజ్ఞానము - మనసా! వినవే. ||జ్ఞా||
జ్ఞానము కౌటిల్య రహితము,
జ్ఞానము నిశ్చల బుద్ధియు,
జ్ఞాన ముభయేంద్రియ నిరోధము,
జ్ఞానము విషయముల జేరమి. ౧
ఆత్మస్తుతిని జేసికొనక,
అహింసా ధర్మము బూని,
ఆత్మేషణ భ్రాంతి నొందక,
ఆత్మజ్ఞాన మందు నుండుటే ౨
తన ధర్మము జెప్పుకొనక,
మనో నిగ్రహ మందు నిలుచుట,
జనన మరణ జరాది భేదము
లను నెరింగి ప్రశాంతు డౌటయే ౩
క్షమా గుణము గలిగి క్షీర
సాగర శయనుని పాద
కమల యుగళము నందు నిర్వి
ఘ్నముగ సన్మతి గలిగియుండుటే ౪
గురుని బోధను బడసి, నిజముగు
గురుతు గని, గురుజనుల సంగతి
స్థిరముగా కాలంబు జరుపుచు
మరువకను భవ మొందకుండుటే ౫

అహంకారము వదలి, తనకు
అనుభవ సుఖదుఃఖ సముడై
బహుజనంబున సందడిని వీడి,
గృహములపై భ్రాంతి దొలగుటే ౬
మోక్ష సామ్రాజ్యమ్ము నొందగ,
మోసమైన పనుల నొల్లక,
పక్షివాహను కుక్షిలో నెడ
బాయ కెప్పుడు స్మరణ జేయుటే ౭
విజన స్థలనివాసి యగుచు,
విడువని వైరాగ్య మతియై,
సుజన గోష్ఠి యందు నుండుచు,
సుగుణుడై మెలంగు చుండుటే ౮
దాసులకు పదదాసుడైన
ధరను సింగరిదాసు గూడియు,
వాసుదేవుని నమ్మి బ్రతుకుచు,
వాసిగను వర్ధిల్లు చుండుటే ౯

**38** నాదనామక్రియ రాగము - ఆది తాళము

ముప్పతిప్పలు బడియెదవా?
ముద్దుగ రాముని దలచెదవా?
ముప్పతిప్పలు బడవైతే, నీ
మ్రుచ్చు వేసమును మొదట నణచవే. ౧

సార్థకమును నీ వెరుగవలే,
సామిని దలచను గూడదవలే ?
తీర్థయాత్రలను సేవించుచు మది
పార్థసారథి నామ మేమరకు. ౨

కూడని పనులను జేతువలే,
కూలిపోయిన గూడునలే ?
కూడని పనులే కూడనె కూడవు ;
కోర్కు లలర శ్రీరమణుని గొల్వుము. ౩

వేదశాస్త్రముల దలచవలే,
వెతల నొంద నీ కిష్టమలే ?
వేదశాస్త్రముల నియతి దప్పకను
వేదవేద్యు నేమరక యుండుము. ౪

ఆర్యుల సేవలు సేయవలే,
ఆ పరమేశుని జూడవలే ?
ఆర్యుల వచనము లందు చిత్త మిక
నైన నుంచి గమనించి కోరు మిక. ౫

సింగరిగిరి పతి బ్రోవడలే ?
సింగరి దానును మరచునలే ?
మంగళగిరి నరసింహుని నామము
మరి మరి వేడుచు నమ్మి యుండవలె. ౬

## 39 ముఖారి రాగము - అట తాళము

మనస ! నీ మొగమోట మేమే ?
మదన జనకుని వేడవేమే ?
వనజనాభుడు విష్ణులోక
వైభవం బిడు ; తెలియ వేమే ? ౧

మున్ను వాల్మీకి హరిని దలచి
ముక్త డయ్యెను వినుము ; నీ
మనసు దీర స్మరణమం దే
మరక దలపక వినవ దేమే ? ౨

ఘనుడు ప్రహ్లాదుండు నుడివిన
ఘనత కెక్కిన రామనామము
వినుతి జేసిన భువిని సాక్షాత్
విష్ణు సన్నిధి జెంద గను మిక. ౩

అజామిళుం డనెడు బ్రాహ్మణు
డాది విష్ణు నామముం గొని
భజన జేసి యశంబు గాంచియు
భక్తి చేతను ముక్తి గాంచెను. ౪

ఖట్వాంగ మహారాజు గంటలో
కనకచేలుని ప్రాపు జేరెను ;
గట్టు జేరి ముక్తి గాంచెను ;
ఇట్టి రాముని మదిని వేడవే. ౫

కరిని నేలిన రామభద్రుని
కన్నులను దప్పకను జూచుచు
మరువ కుండిన మగుడ జన్మము
మరల రాదని నమ్మవేమే ?

శివుని పట్టపురాణి పార్వతి
సిద్ధముగ శ్రీరామ నామము
శివుని తత్త్వవాక్యము లతి
స్థిరమదిని పఠన జేసెను.

సింగరి దాసుండు దలచిన
సింగరిగిరి ధాము నామము
పొంగుచును నిరతంబు మనసున
భంగ మొందక నుడువ వేమే ?

---

## 40 సురట రాగము - అట తాళము

రాముడే గలడు - నాపాలి సీతా - రాముడే గలడు.

రాముడే గలడంచు - మదిని - నీమమున నమ్మినవారికి
కామితార్థము లియ్యబూనుచు - నేమమైన బిరుదు గల్గిన ౧

సర్వరూప ధారుడైన - సర్వలోక విహితుడైన
సర్వసృష్టి కర్తయైన - సర్వజ్ఞ మూర్తియైన ౨

సోమార్క నేత్రుడైన - సామవేద ప్రేష్ఠుడైన
భీమ పరాక్రముడైన - భవభయహర మేటియైన ౩

సింగరిగి రీంద్రుడైన - సింహరూప ధారుడైన
సింగరయ్యకు ప్రభువైన - శంఖచక్ర ధారుడైన ౪

## 41 ఆనందభైరవి రాగము - త్రిపుట తాళము

ఏమి యని తెలుపుదు - రామా నీ మహిమలు
కామారి నుతుడైనా - గణుతింప తరమౌనే ? ॥ఏ॥

సర్వరూపము తానై - సర్వసాక్షియు దానై
గర్వ మొందినవారి - గరుణించు గంసారి ;
కంతుజనకుని గలిగిన -
కామినీభ్రమ లేల కల్గును ?

స్వాంతమున కజ్ఞాన మబ్బిన -
వంతలను బడుచుందు రహహా ! ౧

వటపత్ర శయనుని - వదలక బ్రోవు మన,
కుటిల చిత్తుండైన - గోరి భజించిన,
కామక్రోధ లోభములతో -
కాంతలకు దరి జేరబోకను,
ముమ్మాటికిని శ్రీహరిని నమ్మిన -
మోక్షపదవిని గలుగ జేయును. ౨

శృంగార మగునట్టి - యంగజజనకు జేరి
రంగుగా నీ మదిని నమ్మిన - చెంగటా జేర్చు మనుచు,
సింగరిగిరి వాసుడైన -
సింగరికవి ప్రభువుయైన
మంగళప్రదుడైన రాముడు -
పొంగుచు దరిజేర్చు నిజము. 3

## 42 ఆరభి రాగము - ఆది తాళము

మంచివాడు మంచివా డయ్యా! - శ్రీ రామచంద్రుడు॥
మంచివా డఖిలాధారుని -
మహిమ విని గనిన యంతనే,
సంచితకర్మంబు లన్నియు
ద్రుంచివేసి దరిని జేర్చు. ౧

నిర్మలత్వ మొంద వలెరా -
నిశ్చయంబును దెలియువాడురా ;
మర్మము లేకున్నవానిని -
కర్మరహిత మొందజేయును. ౨

అంతరాత్మ మైనవాడు -
ఆది పురుషోత్తముండు ;
మంతనారాధ భక్తుల -
అంతర్ముఖుల కొసగు మోక్షము. ౩

దుష్టశిక్షకు డైనవాడు -
విష్ణుభక్తుల బ్రోచువాడు ;
కృష్ణరూప దర్శన భక్తి
నిష్ఠ నుండుటె చరమపదవి. ౪

విశ్వము తనయందే యుండు -
విశ్వము తానై యుండు ;
విశ్వ మయుని నెరుగు వానికి -
శాశ్వతపద మొసగు తండ్రి. ౫

బ్రహ్మచర్య మొంద వలెరా -
ప్రణతులై సాధించ వలెరా ;
బ్రహ్మజ్ఞానమయుల నేలే -
బ్రహ్మమయు పరమాత్మ కృష్ణుడు. ౬

ధరను సింగరి దాసును బ్రోచు
వరద సింగరిగిరి నివాసు
నరహరిని నిరతంబు వేడిన
పరమపదము గలుగ జేయు. ౭

## 43 తోడి రాగము - అట తాళము

నందకుమారా - నంద సుందరరూపా.!
విందు నీ మహిమ గో - వింద కృష్ణప్రభో ! ॥నం॥
నీ చిన్ని పదములు - యాచించెద, దయ
గాచి యేలర మమ్ము - గన్న కృష్ణప్రభో ! ౧
మక్కువతోడ నీ - చక్కని రూపము
దిక్కు నమ్మినారా - దివ్య కృష్ణప్రభో ! ౨
సకలము నీవయై - సర్వ జీవులయందు
వికసించియున్న శ్రీ - వేణు కృష్ణప్రభో ! ౩
యశోద బిడ్డవై - అఖిల మహిమల జూపు
శశిముఖుడౌ రుక్మి - ణీశ కృష్ణప్రభో ! ౪
గోపికవాడల - గోపాల బాలుడవై
గోపస్త్రీలకు పసిడి - కొండ కృష్ణప్రభో ! ౫
మదన గోపాల ! మీ - మహిమ లన్నియు దెలియ
కొందువేల ? బంగారు - కొండ కృష్ణప్రభో ! ౬
కంటి నీరూపము - వింటి నీచరితము ;
అంటి నన్నుతి జేతు - నంటి కృష్ణప్రభో ! ౭

అమృతలూరివాసా - అఖిలకలుషనాశా !
అమృతునిగ జేయుగ - నంద కృష్ణప్రభో ! ౮
సింగరిదాసుకు - సిరు లిచ్చి రక్షించు
మంగళకరుడ శ్రీ - రంగ కృష్ణప్రభో ! ౯

## 44 శహాన రాగము - ఆది తాళము

జగన్నాయక - జగన్నాయక ! - జగదాధారక - జగన్నాయక !
నిగమ గోచర, నిత్యనిర్మల - సగుణ నిర్గుణ, సుజన పోషక ! ౧
నిర్వికార, నిరంజన, ఘనుడ - నిరుపమ రూపా, నిఖిలాధారా !
సర్వభూత సముదాయ, యీశ్వర - సచ్చిద్రూపా, నందతనూజా ! ౨
అగమ్య గోచర, అఖిలాధారా - అప్రమేయ, అనుపమ శౌర్యా !
సింగరి గిరివాస, సింగరిపోషా - శ్రీనివాస, శ్రీజగదాధారా ! ౩

## 45 పున్నాగ రాగము - ఆది తాళము

ఆంజనేయా - శ్రీ - ఆంజనేయా !
ఆంజనేయా నీకు - అంజలి సేతు ; నా
నింజలి బాపుము - నీవాడ సుమ్ము. ౧

పవనాత్మజుండవు - పతిత పావనుడవు ;
భవరోగ భేషజ - మవు ధన్యాత్ముడవు. ౨

అంజనీ సుతుడవు - భంజితాసురుడవు ;
కంజాక్షు భక్తాగ్ర - గణ్యా, సన్మాన్య ! ౩

వాసిగ సింగరి - దాసుని బ్రోవవె,
భాసమాన శౌర్య - పరమోదార్యా ! ౪

## 46 తోడి రాగము - అట తాళము

ఎన్నిమాయల బన్నినా వయ్యా ! - ఈ జగమునందు ఎ
ఎన్ని మాయల బన్నినావు - ఎన్ని కెక్కని మోహాబ్ధు
నను
కన్నులను నీరూపు నిల్పక - గాసి నొందించేవు,
తండ్రి ! ౧

లోకములు నీలోన నుండును - లోకమందున నీవు
యుండియు
లోకభూతములందు నివ్వరి - శూకమున వర్తిల్లు
టకు నీ ॥వెన్ని॥ ౨

ఆటలకు అర్భకులు జేయు - పాటివలె భువనంబు లన్నిటి
నూటిగా నాడించి వింతలు - చూచుటకు వటపత్ర
మొందుచు ౩

చేష్ట లన్నియు బొందుచును మరి - చేష్టలను జేయించు
చును సు
శ్రేష్టకుల శిక్షించుచును సు - చేష్టకుల రక్షించు
టకు నీ ॥వెన్ని॥ ౪

నేను నీవను, రానుపోనను - నేను పరచుట నేరి వశమే
నేను నీవను రాను పోనను - నేర్పు లన్నియు నీకె
గావె ! ౫

అంగములు నొక రూపులై నను - ఆనవాలుకు భేద
మగుటను
సంగతిగ గళ లేరుపరచు - నీ సంగతిని గన నెవరి
తరమా ? ౬

అంగజారి సీతనుతా అరి - భంగ గరుడ తురంగ సతము
సింగరిని రక్షించు దివ్య - మంగళ విగ్రహుడ
వయ్యా ! ౭

**47** ముఖారి రాగము - అట తాళము

సీతారామ ! యిదేమో - బహు
చిత్రము మీ మహిమేమో ;
సీతారామ ! మీరు - ఖ్యాతిగ తలిదండ్రి
దాతవై బ్రోచుచు - పాతకముల ద్రుంచు. ౧

శ్రేనిది నిజమను టేమో - ఆరూఢిగ
నున్నవాని మరచు టేమో ;
లేనిది లేదని - ఉన్నది యేమరక
యున్న జన్మరహిత - ఔన్నత్యపద మొసగు. ౨

నీ నామ మధుర మేమేమో - జిహ్వాకు
నానా సౌఖ్యానంద మేమేమో ;
నీ నామ మనిశము - ధ్యానించి వినువాడు
కానన సంసార - మును దొలగి ముక్తుడౌ. 3

సింగరి గిరి వాసుడేమో - సింగరి బ్రోవ
కొంగు బంగరు గాడేమో ;
సింగరిగిరి యందు - మంగళాకారు డు
పొంగుచు దన భక్త - సంఘము దరిజేర్చు. ౪

## 48 తోడి రాగము - ఆది తాళము

తల్లి దర్శన మాయెను - సీతమ్మ యమ్మా॥
తల్లి దర్శన మాయెను ;
తల్లి దర్శన మాయె - తాప మెల్ల బోయె ;
యుల్లము శమ - మాయె - అత్యానంద మాయె ౧

నేటికి దయవచ్చెను - కన్నతల్లి
మాటి మాటికి జూచెను ;
సాటిలేని నిజ - ధాటి రూపమున
కోటి పొమ్ములు మెరయ - కొల్లగ సేవించు
టాయె. ౨

క్షేత్ర క్షేత్రజ్ఞు లను - నిశ్చయములు
నేత్రముల గాన్పింపవే ;
పాత్రునిగా జేయు - భారము వహించు భూ
పుత్రి నిన్నే నమ్మినాను - పుత్రు నన్ బ్రోచెదు ౩
వాక్యత్రయ బోధ నుంచవే - సుస్థిర భా
వములను జేర్చి యుంచవే ;
ఐక్యము చేయవే నన్ను - నాదరించు ; మీ వాక
చక్యమును గలుగ జేసే - చక్కని శ్రీరాము
రాణియా ౪

అచలామనస్క మొంచవే - అకామి జేసి
అత్మానంద మియ్యవే ;
అఖిలాకారము నీవై - ఆదినారాయణివై
అఖిలాంతర్యామివై - ఐక్యమై వెలసియున్న ౫
సింగరి గిరి నరసింహుల - దాసత్వమున
సింగరిదాసును బ్రోచును ;
అంగదేహ భంగము జేసి - చెంగట జేర్చుటకై
రంగుగ సంతసమున - రాత్రి నాకన్నుల గన్పడె ౬

## 49 నాదనామక్రియ రాగము - ఆది తాళము

ఆనందం పర - మానందం బ
 హ్మానందం భజ - గోవిందం అహా!
ఆనందం బని - ఆత్మారాముని
 ధ్యానము జేయుచు - మానసమున గన, ౧
పతిత పావనుని - పాద పద్మము లే
 గతి యనుటచే స - ద్గతి గల్గుటచే, ౨
తారక నామమే - తారక మని సుఖ
 మార ధామునే - మరువక దలపగ, ౩
ఎల్ల రూపములు ఏక రూపమై
 యుండి కదలకను - నున్న పరాత్పరుడు, ౪
సింగరి గిరివాసు సింగరి నేతెను
 భంగపడక శ్రీ - రంగని గొలువగ, ౫

## 50 ...రాగము - ఆది తాళము

రామారామా రామారామా - రామారామా యనవే
రామబ్రహ్మ సంధానము జేసిన-రాముడ వయ్యెద వే వినవే॥ ౧
నీవే నేనని అన్యము లేదని - నిశ్చయమును మది గాంచన్,
కావుబ్రోవుమను మోక్షకాంక్షలును-కామ్యనిరసనం బయ్యెన్ ౨
పూర్ణుడ నైతిని, పూజ్యుడనైతిని - పూర్వభాగ మిది, రామా!
కార్యకారణముల గర్తను గాకను - గంటియుంటి మీదయచే ౩

ప్రాజ్ఞజ్ఞానమునందు నుండుచే - పొందుట మిమ్ముల, రామ
ప్రాజ్ఞుడ వౌట నన్ బూర్ణుని జేసిన-పురాణపురుషా రామా
అఖిలము నేనను ఆనందమనే - యోగము గల్పించితివే ;
సకలమైన చరాచరము నేనై - సంప్రాజ్ఞుడనై తినె, రామా
సింగరిగిరి వాసా సింగరిదేవుడ - శ్రీనివాస శ్రీరామా !
మంగళకరమై మహిని నిండు శ్రీ - మారజనక తారకనామా

**51** నాదనామక్రియ రాగము - అట తాళము

నేను నేనే - నేననువాడను నేనే ;
తాను తానై యున్న - తత్త్వ యోగము నేనే.
మనసు నే గానే - మాయ నే గానే ;
నే ననుటన్ మించు - నిర్వికారుడ నేనే.
ఇంద్రియములు గానే - ఇహమును గానే ;
అచలబ్రహ్మము నేనే - ఆనందమును నేనే.
సర్వము నేగానే - సర్వము నేనేనే ;
సర్వాంతర్యామినే - సాక్షిరూపుడ నేనే.
లింగశరీరము - లంఖించి యుందునే ;
జగదీశుడ నేనే - జన్మము బాప నేనే.
జీవాత్మల గన్న - భావము నేనే ;
దేవ దేవ పర - దేవుడ నేనే.
సత్తు చిత్తును నేనే - సగుణ నిర్గుణుడ నేనే ;
మంతన మందున్న - మహనీయమును నేనే.

మోక్షము నేనే - మోక్షధామము నేనే ;
    మోక్షమార్గము నేనే - శిక్షగురువును నేనే. ౮
అంతరాత్ముని నన్ను - అంతరంగమున నిల్పి
    అంతర్ముఖుడైన - శాంతపురుషుడ నేనే. ౯
సింగరిదాసు నేలు - శ్రీనివాసుని నేనే ;
    సింగరిగిరి వాసుడైన - శ్రీ నృసింహుడ నేనే. ౧౦

**52** భైరవి రాగము - ఆది తాళము

ధన్యుడ నైతిని - దశరథ రామా !
    మాన్యుల వల్ల నీ - మహిమలు విని నే ౧
ప్రేమగీతములు - నా మది జూచి నే
    కామ క్రోధముల - గడదేర్చుటచే, ౨
కరుణను భక్తుల - గాచి రక్షించెడు
    నరహరి ! నీదు గా - నము సేయునంతటి ౩
సరసిజ వదనుని - సత్కథలు చెవి
    కిరువుగ సోకగ - నిహాపరముల నే ౪
వర మునులకు నైన - వశముగాని నీ దివ్య
    సురుచిర రూపము - జూచి నే మ్రొక్కగ, ౫
స్థిరముగ రేపల్లె - పురవరు నా మది
    స్మరణసేయు నీ - చక్కని ప్రేమచే, ౬
ధరను సింగరి దాసు - దాతవైన రామా !
    గురుడవు దైవమవు - మరుగు జొచ్చితి రామా ! ౭

# విజ్ఞానదీప్తి

**53** నాదనామక్రియ రాగము - త్రిపుట తాళము

నేర్చి బ్రతుకుటయు లేదు - జనులు
నేర్వక చెడుటయు లేదు ;
నేర్చి, నేర్వడను - నెపములె గాని
కూర్చిన దేవుని - కృపవల్లె జరుగును. ౧

పూర్వ దత్తమే గాదా - తనువుకు
పూజనీయమే గాదా ?
పూర్వ దత్తము లేకున్నను తా
పొర్లుచు మరి - దొర్లింతలు బెట్టిన, ౨

రంగని దలపక గాదూ - స్వామిని
పొంగుచు గొల్వక లేదు.
సింగరి దాసును - బ్రోచునట్టి శ్రీ
సీతారాముల - దయ లేకను మరి, ౩

**54** నాదనామక్రియ రాగము - ఆది తాళము

తెలిసి తెలియ లేరు - తనువులు
తమ వని భ్రమసేరు.
తెలిసి తెలియకను - తికమక బడుచును
పలుగతులలో బడి - పరమును గాంచరు. ౧

మదము కండ్ల గప్పి - అన్యుల
ముదితల పొందు కొప్పి
మదన జనకుని - మాయల బడుచును
మదము చేతనే - మడియుచు నుందురు. ౨

ధనమె ఘనమని యెంచి - పరుల
ధనమును అపహరించి
ఘనులై వర్తిలు - చుంటయె గాని, య
ఘౌఘ సంచిత - మని స్మరియింపరు. ౩

తప్పు లెంచ వద్దు - దీనుల
దగవు చేయ వద్దు ;
చెప్పెడుమాటల - విని నిరసించుచు
చయ్యన నుపకృతి - సలుపక నుందురు. ౪

ఎరు కేమరక నుండు - సుజనుల
అమృత వాక్కుల వినుచుండు ;
మర్మము తెలియం - గల నరజన్మంబు
మగువలచే జెడి - మణుగుచు నుండు. ౫

కలిమియే బంధము - జేర్చు ; ముక్తిని
గలగుణమే సమకూర్చు ;
ఇల సుఖసంపద - స్థిర మనుకొని తా
మినకుల వంశజు - రాముని దలపరు. ౬

శేవల్లె పురవరమందు - వేణు
గోపాలకృష్ణుని యందు,
ఒప్పుగ మనమును - నుంచిన సింగ
రప్పను గాచే ఘను - డని దెలియరు. ౭

పున్నాగ రాగము - ఆది తాళము

లాభ మేమి లేదు - లక్ష్మీశు దలపక - లాభ మేమి లేదు
లాభము లేదు - లక్ష్యము లేదు,
విభవము లేదు - వినయము లేదు. ౧
మోదము లేదు - మోక్షము లేదు,
బోధయు లేదు - భక్తియు లేదు. ౨
శాంతము లేదు - సౌఖ్యము లేదు,
భీతియు లేదు - మతియును లేదు. ౩
నామము లేదు - నీమము లేదు,
ప్రేమయు లేదు - ప్రజ్ఞయు లేదు. ౪
మానము లేదు - స్నానము లేదు,
ధ్యానము లేదు - జ్ఞానము లేదు. ౫
శ్రేయము లేదు - సిరియును లేదు,
నయమును లేదు - నియమము లేదు. ౬
ధరను సింగరిప్రభు - నరహరి దలపక,
పరిపరి విధముల - బోధల నొందక, ౭

## 56 నాదనామక్రియ రాగము - ఆది తాళము

సాధు సజ్జనుల సాంగత్యముచే
సర్వజ్ఞానము దెలియు నయా;
సాధుసజ్జనాసక్తుడు గాకను,
సమకూరునె యా తత్త్వార్థములు? ౧

'పరోపకారార్థ మిదం శరీర' మను
పరమ రహస్యం బెఱుగ రయా;
పరమపదంబగు పరహిత మెంచక
పరహింసకు మన నేల నయా? ౨

పరరక్షణమే పరమ ధర్మమని
పలుమరు మది నూహించ రయా;
పరకాంతలతో గూటమి గోరుట
పరిపరి దుఃఖ నిబద్ధ మయా. ౩

'అహింసా పరమో ధర్మం' బని
అఖిల ధర్మములు గనరయా;
మహిని దేవతా జన్మ దుర్లభ మని
మాననీయ ముని దలపరయా. ౪

ఆత్మస్తుతి పరనిందల నెప్పుడు
ఆత్మలో నైనను దలచకుడీ;
గంతులు వేయక చింత వీడి శ్రీ
కాంతు ననంతుని సన్నుతి జేయుడీ. ౫

జ్ఞానము ధ్యానము త్యాగము శాంతము
జ్ఞాత్వా బుద్ధిని నిలుపవలెన్ ;
జ్ఞానవజన్మలో సాధన జేసియే,
మరియొక జన్మము గానరయా. ౬

జ్ఞానవంతు లజ్ఞానవంతు ల
న్యోన్యము జడు లని దలప రయా ;
జ్ఞానయుతులె యీ లోకుల నెంచగ ?
జ్ఞానమె ముక్తి నిధాన మయా. ౭

లక్ష్యము గలుగక - భక్తి గలుగునే
లక్షవరహాలు గలిగినను ;
లక్ష్యము కుదురుటే మోక్షపదవిగా ;
లక్ష్యము జెందుటే సులభ మయా. ౮

మిత్రుల భంగిని శత్రుల సఖులని
మిక్కిలి ప్రేమను జూడరయా,
శత్రుమిత్రుల సమముగ నెంచిన
పాత్రుడే లోకపవిత్రు డయా. ౯

'ఘాతం నఘాతకో విప్రః' యనునది
ఖ్యాతిగ నెప్పుడు జరుపవలెన్,
శాంతమానసాక్రాంత కామరాట్
సంతతి సింగరిదాసును గూడుడీ. ౧౦

**57** రేగుప్తి రాగము - అట తాళము

నేనే బ్రహ్మమునని - నమ్మితే మోక్ష - మని యెంచగ
వలెరా;

నేనే బ్రహ్మం బని - నిజము దెల్పిన గురు
సాన్నిధ్య మేమరక - సాధించగను నంత, ౧

కాయం బస్థిరము - మాయలో బుట్టి - మాయంబౌ నిజము;
కాయము బుట్టుట - కర్మబంధ మని
చేయు పుణ్యాపాపము - జగధీశు కర్పింప, ౨

స్వప్రకాశుండై - పరబ్రహ్మ - సర్వమ్మును తానై
స్వప్నజాగ్రత సు - షుప్తులు సమమని
అప్రమేయుమహిమ - అది దెలసి నమ్మిన, ౩

క్షేత్రములే తల్లి - తత్త్వ మెరిగిన - క్షేత్రజ్ఞుడే తండ్రి,
క్షేత్రక్షేత్రజ్ఞుల - యాత్మజ్ఞానమె ముక్తి,
ప్రత్యక్షఫల మని - సత్య మెరిగిన, ౪

వైరాగ్యము మదిని - నిరతము నే - మరక దలపోయు,
వైరాగ్యమహిమచే - వైకుంఠసన్నిధి
ధీరుడై నివసింప - స్థిరమని నమ్మిన, ౫

తానే బ్రహ్మముగా - తలచుటె మోక్ష - మని యెంచగ
వలెరా;

తానే బ్రహ్మం బని - తత్త్వాధి గురుస్వామి
సాన్నిధ్య మేమరక - సాధించగ నంత, ౬

సింగరిగిరి వాసుడు - కామరాజు - సింగరయ్యను బ్రోచును
సింగరి గిరీంద్రుని - స్థిరమతి వేడిన,
మంగళ మొనరించి - మహిని బాధల బాపు. ౭

## 58 పున్నాగ రాగము - అట తాళము

మాయ ఎంతది రా! - ముక్తిపదవి - మాయ గెల్వక లేదురా
తనలోనె పుట్టించు - తనలోనె పెరిగించు,
తనలోనె యణగించు - తానె యంతట నిలుచు ౧
ఆరు చక్రములకు - పరమగు చక్రము
దారి గనుట లేక - దూరము జేసెడు ౨
గురిని సిల్పిన దాని - గుట్టు తెలియును నీకు;
గురుతు మరుపును జేసి - గుర్తి నిల్పకను జేయు ౩
దయ సత్యశౌచముల - దగుల నియ్యదు బుద్ధి;
మయికము కల్పించి - మమత గలుగ జేయు ౪
సింగరికవి గురు - శృంగార తత్త్వము
భంగము నొందక - భావమందున జూడు. ౫

## 59 యమునాకళ్యాణి రాగము - ఆది తాళము

వర్జ్యములైన పనులను సతతము
వదలక జేసెద వెందుకయా?
వర్జ్యమైన పని జేసిన, శమనుడు
భర్జింపక బోనియ్యడయా. ౧

అన్ని పనులకు గర్తలు గలరని
ఆ పగిదిని గన నేరరయా,
ఉన్నది లేనిది తమపై బెట్టుక
నూరక చెడిపోతుందురయా. ౨
ఉన్న విధము గనియుండి ఆత్మలో
దిన్నగ దెలివిని నిలుపరయా,
మన్ననతో రామన్నను దలచి జ
గన్నుత పదవిని గందురయా. ౩
అంగజ జనకుని మాయలనుచు గని
భంగము నొందక నుండరయా,
సింగరిగిరిదాసును బ్రోచునట్టి శ్రీ
సింగరిగిరిపతి వేడరయా. ౪

**60** ఆనందభైరవి రాగము - అట తాళము

ఇదుగోరా గురుకీలకము - జీవా!
అదుగోరా భక్తిసాధనమూ
ఇదుగోరా జీవాత్మ - అదుగోరా పరమాత్మ
ఇది యది వేరనుచు - మది సంశయమును మాను. ౧
ప్రపంచాతీతుడు గదరా - మాయా
ప్రపంచ మైనాడు గదరా?
ప్రపంచధారకుడై - ప్రణవస్వరూపి యై
ప్రపంచ మంతట - బరిపూర్ణు డైనాడు. ౨

కండ్లు నోరు ముఖ్య మనరా – సద్గురు గని
కండ్ల నడుమను జూడ వలెరా.
వడ్లగింజలు దంచి – పరగ బియ్యము జేసి
వడ్లహేయాంశముల – వదలునటుల దెలియు. ౩
సింగరి గిరివాసు గదరా – వేగ
సింగరిని రక్షించు గదరా ;
సింగరిగిరి వాసుడై – శ్రితజన పోషకుడై
మంగళ కరుడై – మహిని నిండియుండు. ౪

61 మధ్యమావతి రాగము – ఆది తాళము

మహావాక్యముల మహిమ దెలిసియు
మహిని జరించుము రో రన్నా !
ఊహను వాక్యత్రయ బోధలచే
ఊర్జిత మొందుము రో రన్నా ! ౧
సర్వ శాస్త్రములసార మనుచు మది
శంకలు మరి జెందకు రన్నా !
సర్వభూత సముదాయ మీశ్వర
సమభావము జూడుము రన్నా ! ౨
సర్వభూత ప్రపంచ భావముల
పంచన లేమో గన రన్నా !
మించియుండి అఖిలాండ రూపమై
మెలగిన మోక్షము రో రన్నా ! ౩

ప్రకృతి పురుషులె తల్లి దండ్రు లని
ప్రేమను ఆత్మలో గనరన్నా !
ప్రకృతిపురుష అమూఢ భావమే
ప్రజ్ఞానం బ్రహ్మము రో రన్నా ! ౪

అరి షడ్వర్గములను జయింపక
హరిధ్యానము నిల్వదు రన్నా !
సారము లేని సంసార భ్రాంతియు
మరువక మేలు కలుగదు రన్నా ! ౫

తానే తానై నిల్చుట పరత
త్వముగా నమ్మము రోరన్నా !
ఆ నేతి నేతి వాక్యముల సరళిని
తను గానిది నిశ్చయము రన్నా ! ౬

అవస్థాగుణమే యాది మధ్య తుద
అఖిలాత్ముండని గనరన్నా !
దేవదేవు నాధార బ్రహ్మము
స్థావరేశ్వరుగ గన రన్నా ! ౭

సింగరిగిరి శ్రీ నృసింహులను
సింగరి మిది గోరునో యన్నా !
అంగరంగ మఖిల మన్య భావమున
భంగము నొందకు రోరన్నా ! ౮

## 62 నాదనామక్రియ రాగము - త్రిపుట తాళము

ఇంద్రియ సహితమె సగుణమురా ;
ఇంద్రియ జయమే నిర్గుణమురా ;
ఇంద్రియ శూన్యత విరామమురా ;
ఇంద్రియములె యిహాపరములురా. ౧

కామ సహితమే జన్మమురా ;
కామరహితమే మోక్షమురా ;
కామపాశములె బంధమురా ;
కామమే యింద్రజాలమురా. ౨

జాగ్రత్స్వప్నము ఒక్కటిరా ;
జాగ్రత్సుషుప్తిని గనవలెరా ;
జాగ్రత్స్ఫురణమె బ్రహ్మమురా ;
జాగ్రత యటువలె నుండునురా. ౩

బ్రహ్మమె సగుణాకారమురా ;
బ్రహ్మమె నిర్గుణమయు డనరా ;
బ్రహ్మ జ్ఞానానందమురా ;
బ్రహ్మము సర్వరూపమురా. ౪

సింగరి గిరి నివాసునురా ;
శ్రీనివాస పదద్వయమునురా ;
సింగరి దాసుడు గొలుచునురా ;
మంగళ మొసగుచు నుండునురా. ౫

## 63 నాదనామక్రియ రాగము - ఆది తాళము

అత్యంత మలినంబైన శరీరము
ఆత్మ గనక నిర్మల మౌనా ?
తత్త్వవిచారణ సేయక జీవికి
సుస్థిరపదవి దొరకునా ? ౧
బొగ్గును దెచ్చి పాలను గడిగిన,
బోవునె మలిన మొకింతైనా ?
అగ్నిలో గాచిన యదియె కాంచన
ఆకారంబై మెరయు సుమీ ! ౨
జాడ్యమునకు దగు నౌషధసేవను
జరుపక నాపద నయమౌనా ?
గాఢమైన యీ జన్మ పావనము
కామజనకు దలపక నౌనా ? ౩
సింగరిగిరి నివాసుడైన మా
శ్రీహరి భజనము సేయకను,
సింగరిదాసుని ముక్తిమార్గములు
శీఘ్రముగా మది స్థిరము జేయక, ౪

## 64 నాదనామక్రియ రాగము - ఆది తాళము

ఏలరా జన్మ ? - అస్థిర మాయా - జాలమే గదరా ?
ఏలర జన్మము - ఏలర సుఖము,
మూలము దెలియక - కాలుని జేరిన ? ౧

బ్రహ్మమే గాదా - జగత్తు పర - బ్రహ్మరూపు గదా,
బ్రహ్మమయుని నర - సింహుని వేడని
జిహ్వను గలిగిన - ఛీఛీ అయయో! ౨

సర్వసాక్షి గదా - జ్యోతిర్మయుడు - సాటిలేదు గదా
సర్వము తానై - సర్వము నంటని
సర్వాతీతుని - సరసత దెలియని ౩

సింగరిగిరి నాయు - సన్నిధి జేరి - సింగరిదాసు గాంచె;
మంగళ మొసగి చె - లంగుచు బ్రోచెడు
అంగజజనకుని - అహహా చూచెను. ౪

## 65 శహాన రాగము - ఆది తాళము

నీలోన దేవు డుండురా - నెలవు దెలసి యుండరా.
కాలుని జేరక మనసు - కలిసి హరిని వేడరా. ౧

పుట్టె నరళి దెలియరా - గిట్టె నరళి దెలియరా.
నట్టనడుమ కలవరపాటు - రట్టుజేసి దెలసి మెలగర. ౨

కర్మముల దొలగరా - కర్తృత్వము బోనాడరా,
మర్మములు గని నిష్కామ - కర్మములు జేయరా. ౩

క్షేత్రములు దెలియరా - క్షేత్రజ్ఞు మది జూడరా,
క్షేత్రక్షేత్రజ్ఞుల దెలియగ - పాత్రత తానె ముల్లోకముల.

మోక్షమార్గము దెలియరా - మోహజాలము వీడరా.
పక్షపాతములేక జీవుల - ప్రేమతో జూడంగ వలెరా. ౫

తొలగితొలగి యుండకురా - తెలసి మెలగి నడువరా,
చెలగి సింగరి దాసును బ్రోచె - పాలనయనుని
మహిమ గనరా. ౬

## 66 ఖమాచి రాగము - జల్పా తాళము

పరమయోగిపుంగవులను - భక్తి దలచుడీ.
పరమపదవి జేరుటకును - సరణి జూడుడీ. ౧
పాంచభౌతిక దేహముల - నెంచ బోకుడీ.
సంచిత కర్మజములను వేగ - ద్రుంచి వేయుడీ. ౨
'తత్త్వమసి' యనెడు మంత్ర - తత్త్వ మెరుగుడీ.
సత్వగుణ విశిష్టులై య - సత్వవృత్తి మానుడీ. ౩
దృశ్య వస్తుజాతమెల్ల - నశ్వ మనుకొండీ.
వశ్యమైన యాత్మయొకటి - దృశ్యమని యెరుగుడీ. ౪
వర గురూపదిష్ట మంత్ర - శరణు గాంచుడీ.
ధరను సింగరిహరిని కృపను - దలచి మెలగుడీ. ౫

## 67 ముఖారి రాగము - త్రిపుట తాళము

సచ్చిదానందమూర్తిని
సరగున గనుగొనవే - అఖిలము
అచ్యుతుని మహిమము గాని
అన్యము లే దనుకొనవే. ౧

ఆదిపురుషుని గన్నుల జూచిన,
ఆపద లెక్కడిదే - గురుని
బోధను వడసి నిష్ఠ మెలగిన,
మాధవుడవై యుందువే. ౨

ఒకరి కొకరు వసతులు జేయుట
వసుధలో నరులకు శక్య మగుః - సద్గతి
చాకచక్యమున తానే తానై
చపలత లేకను నొంద నగున్. 3

స్థూలము నిధిధ్యాస నొందిన,
సగుణ నిర్గుణములు తానె యగున్ - అట్లుండని
స్థూలమె పరమ నీచముపాలై
సౌఖ్య మొందక చెడుగు యగున్. ౪

నిధిధ్యాసను బొందక దాని
నిశ్చయజ్ఞాన మబ్బదురా - ఎక్కువ
చదువు సంధ్యల, జప తపముల,
చంచలభక్తి నిలుచునురా. ౫

ప్రకృతిపురుష చిద్విలాసముల
ప్రాజ్ఞుడు దెలిసికొని - మాయా
ప్రకృతి స్వభావము విడిచి
పురుషుడు తానని నిశ్చయించుకొని ౬

ఈశ్వరభావము నొంద, వేగమే
యిహజన్మములు బాయు సుమా - పరమ
శాశ్వదానందమును జేరి
స్థాయిగ నుండి మనుచు శ్రీగురు ౭

సింగరిగిరి వాసు డైన
శ్రీనరసింహులను - కామరాజు
సింగరిదాసుడు జేరి,
శంక లేకను సేవించునయా. ౮

## 68 హిందూస్థాని కాపి రాగము - ఆది తాళము.

సాధులార వినుడీ హరిశ్రీ - మాధవు సత్కృప గనుడీ మనుడీ,
భేదము సెందక బోధమార్గమును గనుడీ మనుడీ,
మత్స్యరూపమై మకరాలయమున - సోమకుని ద్రుంచి
స్వేచ్ఛమైన యామ్నాయము నజనకు నిచ్ఛాసిద్ధిగ నిచ్చెన్. ౧

అబ్ధిమథనమున నద్రి గ్రుంకగను - అసురులు తల్లడపడగన్
అబ్ధిజేరి యాధారకూర్మమై - యాపద దానడగించెన్ ౨
కిటియై ధర నుద్ధరణము సేయగ - సురరిపు డెదురుగ నుండన్
మురరిపుడా కనకాక్షుని ద్రుంచియు - ముజ్జగంబులను బ్రోచెన్. 3

నరకేసరియై హిరణ్యకశిపుని - కరనఖరములతో ద్రుంచి,
వరదుండై ప్రహ్లాదుని బ్రోచిన కరివరదుని మది
గనుమా. ౪

బలి యిల పాదత్రయము నొసంగిన బహువాదుండై వేగన్,
జలజ భవాండము నిండిన వామను-జగదీశునిగా
గనుమా. ౫

నరపతులను మున్నేడు మారులు - పరశుధారియై గూల్చి,
పరశురాముడై నెగడెను హరి స - ధర్మపరాయణు
డగుచున్. ౬

దశరథసుతుడై దశకంఠుని నొక-విశిఖంబున దెగటార్చి,
దశరథరాముడు తన సతి గూడుచు-దనిపెను లోకము
లెల్లన్. ౭

దుష్ట నిగ్రహము శిష్టపాలన మ-భీష్టతతో నొనరించి,
హృష్టాత్మకులై హరికృష్ణులు సక-లేష్ట వరదు లై
మనిరి. ౮

బద్ధవైరి పాషండుల నరక ని-బుద్ధులుగా నొనరింపన్,
శుద్ధ రూపమున వెలసె జగత్పతి - బుద్ధరూపుడని
చెలగన్. ౯

కల్కి రూపమున గలియుగాంతమున - కంజదళాక్షుడు వేగన్
కలుషాత్ముల గదనంబున గెలిచి - కాలుని కతిథుల
జేసెన్. ౧౦

సింగరిగిరి నిలయున్ నిరతము - సింగరిదాసుడు గొల్చు
మదిన్ ;
మంగళమొసగును పొంగుచు గొల్చిన - అంగజ జనకుడు
ప్రేమగ. ౧౧

## 69 సౌరాష్ట్ర రాగము - రూపక తాళము

భయమువల్లనే భక్తిగల్గు - భవములు దొలగు.
వాయుసుతుని - వందితుని గానరా.
భయమువల్లనే భక్తిగల్గు - భక్తివల్లనే ముక్తిగల్గు.
కాయము లయమవుటతోను - గనియు గానక
మోసపోవుదువు. ౧

సానందోపాఖ్యానము - సరళియు దెలిసిన,
జ్ఞానమార్గము లభ్య మగునురా.
సానందోపాఖ్యానము - స్వానుభవముకు దెచ్చు
కున్నను,
ఆనందమహిమ జెంది - ఆ రాముని పదవి
గాంతువు. ౨

పరమభాగవతుల - పదపద్మములు
నిరతము గొనియాడరా.
పరమ భాగవతులు - ప్రస్తుతి జేసెడి
పురుషోత్తముని నామము - పతిత పావన
మగును, వినరా. ౩

సింగరినారేంద్రుడైన - శ్రీ నారసింహులు
సింగరిదాసును బ్రోచునురా.
సింగరినారేంద్రు వేడర - శరణు జొచ్చి గావుమనరా.
అంగనాసక్తియు వదలర - నారాయణు
మహిమ గనరా. ౪

## 70 రేగుప్తి రాగము - అట తాళము

నారాయణుడే - నిఖిలవేద - పారాయణుడే
నారాయణుడే - నరరూపధారుడే
పరతత్త్వమయుడైన - పరమాత్ముడు వాడే. ౧

ఇనకులజుండై - దశరథునకు - ఇష్టకొమరుండై
మహామునితో జని తమ్ముడును తా - మహానిశాపము చేత
శిలయగు
నన్ను తాంగినిగాచి కౌశికు-జన్మమును నేర వేర్చునట్టి. ౨

హరువిల్లు విరచి - జనకుని యింట - వరస్త్రీని వరించి
పురమునకు జనుదెంచుచుండగ - భూనుతుండపుడడ్డ
గింపగ
నరవరులు బెదరిల్లి పారగ - పరశురాముని బలము
గైకొను ౩

జనకాజ్ఞచేత - వనవాసమున - కనుజుండు సీతా
అనువుగ జనుచుండ రాక్షసు - లను దునిమి మునుల
కప్పు డిం
పొనరగ ఖరదూషణాదుల - సని వధించి భయము
దీర్చిన ౪

రంగుమీరగను - బంగరుయిర్రి - రాక జూడగను
అంగమెల్ల జెమర్చ నుండ - రాంగి జానకి రాముఁబంప చె
రంగు బట్టుచు ముంగిటికి కం - రంగమును వెన్నాడగ
వడిగ జను ౫

మాయల గనియు - ఆ మాయయిర్రి-మహిమ పొడగనియు,
సాయకముచే దునిమి పర్ణ - శాలకు విచ్చేయుచు యాక
తాయ రావణుఁడు సీత గొనిజన - తమ్మునితో వన
మెల్ల వెదకెడు ౬

పక్షిని బ్రోచి - రవిజునకు తనదు - దక్షతను జూపి
తత్క్షణంబున వాలి దునిమియు - యక్షకాంతకుచేత
సీతా
వీక్షణంబును వినుచు వారిధి స - మక్షమున కేతెంచి
నిలచిన ౭

దండివనచరులు - మెండై నట్టి - కొండరాసులను
నిండువేడుక నీలుని కివ్వగ - రెండుచేతుల నందుకొని తా
యండలను బోకుండ నబ్ధిలో - బండిదారి నొనర్చ
జేసెను. ౮

కండక్రొవ్వునను - రావణుడు తనదు - పంక్తి గీటుచును
భండనము నెదిరింపగా ప్ర - చండ తేజముమీర తన కో
దండ ముద్దండత ధరించియు - చెండెగద రాక్షసుల
నెల్లను. ౯

పౌలస్త్యుడంత - రావణుని కిల - కిల నవ్వెనంత
ఏలరా నాతోడి చలము - లేలరా నీ పోగ రడంచెద
నిలువుమిలు మని నిశితశరముల - నిర్జరారిని నీల్గ
జేసెను. ౧౦

పోయెను భయము - భువనముల కెల్ల - కూడెను జయము.
పాడిరి సురసతులు నృత్య - మాడిరి గంధర్వు లప్పుడు.
వేడుకతో జానకిని గూడి - యెక్కిరి పుష్పకము
నెక్కిన ౧౧

తేజము మీర - అయోధ్య తనదు - రాజధానిగను
భూజనులకు ప్రియ మొనర్చుచు - భూజాతకు ముద
మొసంగుచు
తా జగన్నుతు డనుచు సింగరి - దాసు నేలిన రామ
చంద్రుడు ౧౨

71 నాదనామక్రియ రాగము - ఆది తాళము

కృష్ణుని గుణకథ శక్యమె తెలుపను ?
విష్ణుమూర్తిగ గనువారా-కృష్ణు-విష్ణుపూర్ణుడని మనువారా
కృష్ణుం డాది పురుషుం డైతే,
కృష్ణ లీలలను జెప్పుదురా - విరాళు - కృష్ణ చరితము
జెప్పుదురా. ౧
దేవకీ వసుదేవ సుతుండై
దేవత లెల్లను బ్రోచె - భువి - దీనజనులను గాచె. ౨
పూతన యను రాక్షసిని దునిమియు
భూతనాథుడై మించె-వి-ఖ్యాతి యోగులను గాచె. ౩
శకటాసురుని వికలము జేసిన
సకలాత్ముకుడె సుమ్మా - హరి - వికసితాబ్జముఖు
డమ్మా. ౪
తృణావర్తుని తునకలు జేసిన
మణిమయ భూషణు డతడు - ముని - ప్రణుత విభవు
డగు నతడు. ౫
వెన్నల ముచ్చిలించినా వని
వెన్నుని రోలను దల్లి - బంధించెను కల్పవల్లి. ౬
రోలు వెంటరా మద్దుల గూల్చిన
బాలుని జూచిన యశోద - కడు - లాలనజేసె నో
యమ్మా. ౭

పశువుల గాచుచు నొకమద మడచిన
  పసిబాలుం డతడమ్మా - జగదీశుడు వెన్నెలరేడు. ౮
పశుల గోపకుల బ్రహ్మ దాచినను
  రసికుడు సర్వము తానై - పురవాసుల బ్రోచెను
  కూర్మనై. ౯
బ్రహ్మయు కృష్ణుని మాయగ దెలసి య
  జిహ్వాత నిజె పశుబాలుర - పర బ్రహ్మగ సేవించెను
  నిజము. ౧౦
గోవర్ధన గిరి వ్రేల నెత్తిన
  గోపకృష్ణుడె యతడు మనపై-గావగ ప్రభువుగ నతడు ౧౧
మందరగిరి తన మూపున మోపిన
  సంకతనూజుం డతడమ్మా-భవ బంధ విమోచనుడమ్మా ౧౨
భక్తుల పాలిటి పరమదైవ మని
  వక్తలు పలుకగ వింటి-నీ-యుక్తితో మెలగుమి
  మంటి. ౧౩
దేవతలకు శ్రీదేవు డమృతము
  ద్రావగ నిచ్చిన నాడు-వారి-దేవదేవుడే నిజము. ౧౪
భావంబులకును దేవ దేవుడై
  భావదేవు డని వింటి-యా-దేవుని నే గనుగొంటి. ౧౫
ఇహపరభోగదు డై యహిమర్దను
  డై హితకార్యము జూపె - ద్విజ వాహనుడై పాడ
  నూపె. ౧౬

రాముని మునిహృత్కమల ధాముని
వేమరు దలపవమ్మా - శ్రీ - రమావిభు డనవమ్మా. ౧౭

బుధజనులను గొనియాడిన వారలు
బుధజను లౌదురు సుమ్మీ - ముని - పథమిది యని
చేకొమ్మీ. ౧౮

మంగళ విగ్రహు మహిమ లన్నిటిని
సింగరకవి వర్ణించె - ని - హంగతురంగుని గాంచె. ౧౯

**72** ...రాగము - ఆది తాళము

మాయను నరికినవాడై - గురు - రాయనితో జతగూడు
బాయక మనుకలు - రోయుచు సత్కళను
ఏ యెడ జూచిన - నేకము తానై ౧

కుండలి నటు భేదించి - మూ - ఖండముూను ఛేదించి
అండపిండ బ్ర - హ్మాండము గూడియు
నిండి పండియును - నిర్వికల్పమై ౨

సన్నపు బిలమున దూరి - రెండు - కన్నుల సంధ్యను జేరి
పున్నమ వెన్నెల - పొందు పరచుకొని
తన్ను దెలసినయా - తారక మిదియని ౩

మూడారింటిని మూసి - ఆ - మూలకవాటము దీసి
ఇడాపింగళ - జోడు గూడుకొని
మూడు గడచి యా - మూలము తానై ౪

ఘ్రాణమున రేచించి - మణి - పూరకమున కుంభించి
 ధారణమున ని - వారణ సేయుచు
 నారాయణ గురు - పారాయణుడై ౫
వాసప్రస్థము విడక - మాయ - తనువును నమ్మిబోక
 పూను బ్రహ్మగురు - భావ మేమరక
 తానే తానను - తథ్యము మరువక ౬
ధ్యానయోగము గలిగి - ఆ - మానసమున నిండియుండి
 కాననమున నేని - యి ట నుండియేని
 కనివిని యెప్పుడు - ఆనందముతో ౭
ప్రాణాయామమును దెలిసి - పూర్ణ - భావమునందు దనిసి
 బాణాసురహరు - ప్రాపును గలిగి
 జాణమార్గసం - చారము గలిగి ౮
శుకాధ్యాత్మ కీర్తనము - నిత్య - సుఖజన్మ విరహితము,
 ఒక జపమున - సద్గతి లే దని
 సకల శాస్త్రముల - సారమె యనుచు ౯
ప్రకృతిద్వాయ దోషరహితము - పూర్వ - సుకృతఫల
 విశేషము
 ప్రకృతి పురుషుల - భావములను విని
 పూర్ణజ్ఞానమున - బ్రహ్మము గాంచుచు ౧౦
తెరలోపలనే నరకము-గన - తెరలోపలనే మోక్షము
 తెరలోపల - మర్మంబుల దెలియక
 దెలిసి దెలియకను - తికమక బడకను ౧౧

చావక చచ్చిన యోగి-మరి-చచ్చి చావని యోగి
చావ బుట్టిన - సరసుని దెలిసిన
చరమ పదము - కరతలామలకము. ౧౨
అరి షడ్వర్గపు జయమే - ఆది - నారాయణుని పదమే ;
అరిషడ్వర్గపు - జయము లేనిది,
ఆత్మ జేరకను - పతితు లగుటను, ౧౩
మాధవు దలచుచు నీవు - శ్రీ - మాధవు మరువకయుండీ
మాధవు జేయుము - మాయను దాటుము ;
మాధవుల మ - ర్మమ్ముల దెలియుచు, ౧౪
ప్రకృతియే నీకు దల్లి - పర - పురుషుండే నీకు దండ్రి ;
ప్రకృతి పురుషుల - భావమ్ముల గని
పూజ్యుడవై - బ్రహ్మము గావలెరా. ౧౫
సింగరిగిరివాసుమహిమల్ - బహు - శృంగారంబై యొప్పన్
సింగరిదాసుడు - సేవించుచు ను
పొంగుచు మదిలో - పూర్ణత బొందెను. ౧౬

# మంగళము

**73** మధ్యమావతి రాగము - అట తాళము

లాలి రఘుకుల తిలక ! లాలి - రఘురామ !
లాలి యార్తశరణ్య ! లాలి.
లాలి నత సుతనామ ! - లావణ్య సీమా !
లాలి తులసీ దామ ! - లాలి జయరామా ! ౧

కామి గాని మోక్షకామి గాడు - కాని
కాముకులకు మోక్ష మగుపడ దయ్యా !
ఈ మర్మ మెట్లకో విధి - నెరుగ వలయు ;
ఈ కర్మముల దొలగి - కడతేర వలయు. ౨

సంకర్షణుని ధ్యాన, సర్వ - శాస్త్రములు
సర్వధర్మంబులును సమకూరుచుండు.
సింగరిదాసు నిశ్చయ - మనుచు నమ్మి
సేవించు నాత్మలో - శ్రీనివాసులనూ. ౩

**74** భూపాల రాగము - త్రిపుట తాళము

శ్రీసీతారామా శ్రితజనకామా - శ్రీసదానందుడ లేరా
వాసుదేవ మిమ్ము నానచే గోరితి - బోషింప గదవయ్యా లేరా ౧

కరివరదా మమ్ము గాచిరక్షించవే - పరమపురుషుడ లేలేరా
వరద పద్మనాభనరహరి కేశవ - నారాయణమూర్తి లేరా ౨

అచ్యుతానంత యవతార దేవ - అఖిలవేద వేద్య లేరా
కాంచనచేలుడ సురరాజరక్షక - పంచదారచిలుక లేరా ౩

మాధవగోవింద మధుసూదన విష్ణు- మహిమింపు వామన లేరా
శ్రీధర త్రివిక్రమ హృషీకేశ - శ్రీనివాసమూర్తి లేరా ౪

దామోదరా ప్రద్యుమ్నానిరుద్ధ - ధరధరా సంకర్షణ లేరా
నా మనోహర పురుషోత్తమ మధోక్షజ - నను గన్న స్వామి లేరా ౫

జనార్దనా యుపేంద్రుడ శ్రీకృష్ణ - జగదేకవీరుడ లేరా
అనిశము నమ్మితి నను బ్రోవవే రామ - నరనారాయణ లేరా ౬

మీ మహిమ మెన్న యెంతటివారము - మహితత్త్వవేది లే లేరా
మిమ్ము గొల్తునయ్య మమ్మేల గదవయ్య - మీ పుణ్యమో
యయ్య లేరా ౭

పరిపరివిధముల పరమాత్మ మిము గొలుతు - ప్రపంచ
సూత్రాత్మ లేరా
ధర సింగరయ నేలు - సింగరిగిరిరామ - నరహరి కృపజూడ
లేరా ౮

## 75 నాట రాగము - అట తాళము

రామ ! మంగళం - వైకుంఠ - ధామ ! మంగళం
రామ ! పరంధామ ! - రామ ! తారకనామ !
రామ ! సుజనస్తోమ ! - రామ ! సార్వభౌమ ! ౧

సర్వచరాచర - సకలాత్ముడవైన
సర్వేశ ! భవనాశ ! - సగుణనిర్గుణరూప ! ౨

సామగానలోల ! - భూమండలాధీశ !
ప్రేమచే భక్తుల - బ్రోవగ కర్తవౌ ౩

జ్యోతిర్మయు డని - ఖ్యాతి పరదేవతా
స్తుత్యవౌ శ్రితపక్ష ! - నిత్యనిర్మలరూపా ! ౪

దామోదర కృష్ణ - ధరసుత వరనుత
రామ రఘుకులచంద్ర - రామ మహారాజ ! ౫

సింగరిగిరి వెలసిన - శ్రీనృసింహుదయును
సింగరిదాసును బ్రోచు - శ్రీరమారమణా ! ౬

## 76 ముఖారి రాగము - ఆది తాళము

శ్రీరామ రామ ! రామాశ్రిత ! మంగళం ;
శ్రీరామ ! తారకనామ ! శుభమంగళం. ౧

భవభయహార ! సార్వభౌమ ! మంగళం ;
దివ్యచారిత్ర ! పరమపురుష ! మంగళం. ౨

వసుధ సింగరిదాసు నేలిన వరద ! మంగళం ;
భావనారాయణ ! నరసింహా ! మంగళం. ౩

స మా ప్త ము

సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమహేంద్రవరము

ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల

# విజ్ఞప్తి

ఈ గ్రంథమాలలో వెలువడు గ్రంథములకు మొదటి నుండియు కాలనియమ మేర్పరుపబడ లేదు. చందాదారు లేకొందరైనను స్థిరముగ నుండరైరి. కాని ముఖ్యముగ నభిమానుల సాహాయ్యముతో పుస్తకము లప్పుడప్పుడు ప్రకటితము లగుచునే యుండెను. అయ్యవి ఆత్మోద్దీపనమునకు, భారతాభ్యుదయమునకు, ప్రపంచమైత్రికి తోడ్పడునవి యని తలంప బడుచు ఆంధ్రభాషాభిమానులచేతను వార్తా పత్రికల చేతను విశ్వవిద్యాలయములచేతను ఆమోదితము లయ్యెను. ఆ పుస్తకముల పట్టిక యిందు వేరొకచో ముద్రింపబడెను.

చందాదారుల వద్ద ముందుగా సంవత్సరపు చందా వసూలు చేయు పద్ధతి యెప్పుడును లేదు. వారు వెలువడిన ప్రతి గ్రంథమును తగ్గింపు వెలకు తప్పక కొనవలయు ననియె నిర్ణయము. చందాదారులుగ జేరి యటుల సాయపడిన మిత్రులకు వందనములు. ఇప్పుడు చందాదారులకు రు 1 కి రెండు అణాల చొప్పున వెలలో తగ్గింపుచేయబడును. చందాదారులగుటకు భాషాభిమాను లెల్లరు ప్రార్థితులు.

11

గ్రంథమాలకు విరాళము లొసంగుచు ధనసాహాయ్య మింతవరకు జేయుచు వచ్చిన సుహృదయులకు నే నెంతయు కృతజ్ఞుడను. ఇకముందు కూడ వారి ప్రత్యేకసాహాయ్యము లేనిది నేను తలపెట్టెడి గ్రంథములు వెలువడ నేరవు. వారు తమ యాదరము నికముందును జూపుదురని విశ్వసించెద. ఇతర మిత్రులు గూడ నట్టి చేయూత నొసంగ వలయునని విన్నపము. దాతల నామము లీక్రింది వివరణ ననుసరించి "గ్రంథమాల అభిమాన వర్గము" శీర్షికక్రింద కృతజ్ఞతా సూచకముగ ప్రకటింపబడును.

1. ప్రధాన పోషకులు నూరురూపాయలు, అంతకుపైన,

2. పోషకులు ఏబది రూపాయలు, అంతకు పైన,

3. సహాయులు పాతిక రూపాయలు, అంతకు పైన,

గ్రంథప్రచురణ సమయములకు ముందుగా ఒక్కసారిగ గాని, కొన్నిదఫాలలో గాని విరాళము లొసంగు దాతలు. ప్రస్తుతము వృద్ధాప్యమున సాధ్యమైనంతవరకు నే నీ గ్రంథమాలోద్యమము సాగింపవలయునని యాశించుచున్నాను. ఇప్పటి యభిమాన వర్గములోనివారి నామములు, ఈ గ్రంథము—ముముక్షు చరిత్రము—నకు సాయము చేసినవారి నామములు ఇందు మరొకచో గాన నగును. ఇంతకు పూర్వమున్న గ్రంథమాల నిబంధన లన్నియు రద్దు చేయబడినవి.

సంపాదకుడు

# ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల

# అభిమాన వర్గము

## ప్రధాన పోషకులు:

శ్రీ రాజా నాయని వెంకట రంగారావు బహద్దరు గారు,
(దక్షిణ) హైదరాబాద్

## పోషకులు:

1. శ్రీ జమీందార్ ముక్త్యంగి జగ్గారావుగారు, రాజమండ్రి
2. శ్రీ ప్రొఫెసర్ ఎమ్. వి. ఎన్. సుబ్బారావుగారు, ఎమ్. ఏ. తెనాలి

## సహాయులు:

1. శ్రీ ఆడ్వొకేట్ వెలగపూడి సుబ్బారావుగారు, బాపట్ల
2. శ్రీ ,, దేశిరాజు హనుమంతరావుగారు, గుంటూరు
3 శ్రీ ,, కామరాజు కృష్ణమూర్తిగారు, మద్రాస్
4. శ్రీ డాక్టర్ దేశిరాజు వెంకటప్పారావుగారు, బాపట్ల
5. శ్రీ మేజర్ కామరాజు నరసింహారావుగారు, ఎమ్. డి; ఎఫ్. సి. సి. పి; ఎఫ్. ఐ. సి. ఎస్. సూపరింటెండెంటు టి. బి. సానిటోరియం, తాంబరం
6. శ్రీ కామరాజు వెంకట కృష్ణారావు గారు, నెల్లూరు
7. శ్రీమతి మూలుపూరి సౌభాగ్యమ్మగారు, తెనాలి
8. శ్రీమతి కామరాజు వరలక్ష్మీ దేవిగారు, బి. ఎస్సి; బి. ఇడి. రాజమండ్రి

ఈ 'ముముక్షు చరిత్రము' యొక్క ప్రచురణమునకై
తమ భక్తికానుకలు పంపిన దాతలు :

1. శ్రీ ఆడ్వకేట్ దేశిరాజు హనుమంతరావుగారు, గుంటూరు రు 10
2. శ్రీ డాక్టర్ దేశిరాజు వెంకటప్పారావుగారు, బాపట్ల రు 10
3. శ్రీ ,, వెంపటి సూర్యనారాయణగారు, తెనాలి రు 5
4. శ్రీ ,, సత్తిరాజు సూర్యనారాయణరావుగారు, పెనుగొండ రు 5
5. శ్రీ ,, వంగూరి సుబ్బరామారావుగారు, సర్పవరం రు 2
6. శ్రీ డిస్ట్రిక్టు మున్సిఫ్ అడవికొలను హనుమంతరావుగారు, పిఠాపురం రు 5
7. శ్రీ కరణం మామిళ్ళపల్లి వెంకటరత్నంగారు, రేపల్లె రు 5
8. శ్రీ భూస్వాములు మామిళ్ళపల్లి హనుమంతరావుగారు, మామిళ్ళపల్లి రు 4
9. శ్రీ దేశసేవకులు తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు, ఎమ్. ఏ. తెనాలి రు 4
10. శ్రీ ఆడ్వకేట్ కామరాజు కృష్ణమూర్తిగారు, మద్రాస్ రు 5
11. శ్రీ కామరాజు బాపయ్యగారు, ఎమ్. ఏ; ఎమ్. ఎస్‌సి (ఆనర్సు); బి. ఇడి. స్పెషల్ ఆఫీసర్, బ్లైండ్ స్కూలు, పూనమిల్లి రు 10
12. శ్రీ కామరాజు వెంకటరత్నంగారు, రాజమండ్రి రు 10
13. శ్రీమతి కొణిదెన శ్రీదేవమ్మగారు, బళ్ళారి రు 5
14. శ్రీమతి మూలుపూరి సౌభాగ్యమ్మగారు, తెనాలి రు 25
15. శ్రీమతి కామరాజు వరలక్ష్మమ్మ దేవిగారు, బి. ఎస్‌సి; బి. ఇడి. రాజమండ్రి రు 25